# ఐతరేయోపనిషత్తు :
# ఆంధ్రటీకాతాత్పర్యసహితము

చెన్నపురి, 1920

Record no. 674

# Aitarēyōpaniṣattu : Āṃdhraṭīkātātparyasahitamu

Cennapuri, 1920

Record no. 674

## Bibliographic Record Target

ఐతరేయోపనిషత్తు : ఆంధ్రటీకాతాత్పర్యసహితము.- చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1920.

192 p. ;12 x 9 cm.

Record no. 674

Aitarēyōpaniṣattu : Āṃdhraṭīkātātparyasahitamu.- Cennapuri : Vāviḷla Rāmasvāmiśāstrulu aṃḍ Sans, 1920.

192 p. ;12 x 9 cm.

Record no. 674


శ్రీరస్తు.

ఐతరేయోపనిషత్తు.

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచేఁ

ప్రకటితము.

1920.

9379





896

ఋగ్వేదీయ

# ఐతరేయోపనిషత్తు.


ఆంధ్రటీకాతాత్పర్యసహితము.



వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచేఁ

ప్రకటితము.

1920.

Printed by
V. RAMASWAMY SASTRULU & SONS
at the "VAVILLA" PRESS,
Madras.—1920.

హరిః ఓమ్.

ఋగ్వేదీయ

# ఐతరేయోపనిషత్తు.

## ఉపోద్ఘాతము.

---

### శ్రీమచ్ఛంకరాచార్యవిరచితావతారిక.

ఓమ్. పరిసమాప్తం కర్మ సహ అపరబ్రహ్మవిషయ విజ్ఞానేన సా ఏషా కర్మణో జ్ఞానసహితస్య పరాగతిః ఉక్తవిజ్ఞాన



ద్వారేణ ఉపసంహృతాం "ఏతత్సత్యం బ్రహ్మ ప్రాణాఖ్యం" "ఏష ఏకో దేవః" "ఏతస్య ఏవప్రాణస్య సర్వే దేవా విభూతయః" "ఏతస్య ప్రాణస్య ఆత్మభావం గచ్ఛన్ దేవతా అప్యేతి" ఇత్యుక్తమ్.

తా. కర్మము పరబ్రహ్మజ్ఞానము కలుగుటతోడనే పరిసమాప్తమైనది. జ్ఞానసహిత మగుకర్మమునకు శ్రేష్ఠమగునీపరమగతి విజ్ఞానము ద్వారముగా నుపసంహరింపఁబడుచున్నది. "ఇదే ప్రాణ మనుపేరు గల సత్యమైనపరబ్రహ్మము" "ఇది యొకటే దేవుఁడు" "సకలదేవతలును ఈప్రాణముయొక్క వికారములు" "ఈప్రాణముయొక్క ఆత్మత్వమును బొందువాఁడు దేవతలను బొందుచున్నాఁడు." అని చెప్పఁబడినది.

మూ. "సో ఽయం దేవతా ప్యయలక్షణః పరః పురుషార్థః, ఏషః మోక్షః, స చ అయం యథోక్తేన జ్ఞానకర్మసముచ్చయ సాధనేన ప్రాప్తవ్యః న అతః పరం అస్తి," ఇతి ఏకే ప్రతిపన్నాః.

తా. "కావున, దేవతలను బొందుటకు సాధనమైనయదియే మనుజులు కోరఁదగిన శ్రేష్ఠమైనవస్తువు. ఇదే మోక్షము. ఈమోక్షము చెప్పఁబోవు జ్ఞానకర్మసముచ్చయసాధనముచేఁ బొందఁదగినది. దీనికంటె మేలైనది లేదు." అని కొందఱనెదరు.

మూ. తాన్ నిరాచికీర్షుః ఉత్తరం కేవలాత్మవిజ్ఞానవిధానార్థమ్, "ఆత్మా వా ఇదమ్" ఇత్యాది ఆహ.

పైని చెప్పిన అభిప్రాయము సరికాదనుట.—

తా. అట్టివారిని తిరస్కరింపనిచ్ఛగలిగినవారై ఏకమైన ఆత్మను తెలిసికొనవలయు నని విధించుటకొఱకు "ఇది ఆత్మగానే (1-1-1) అని ప్రారంభించి, ఇఁక చెప్పఁబోవునట్లు (ఉపనిషత్తును) చెప్పుచున్నారు.

మూ. కథం పునః అకర్మసంబన్ధి కేవలాత్మవిజ్ఞాన విధానార్థః ఉత్తరో గ్రన్థః ఇతి గమ్యతే?

నిర్గుణబ్రహ్మజ్ఞానమే ముక్తికి సాధనము.—

తా. (ఆక్షేపము) అయినను, ఉత్తరగ్రంథము కర్మసంబంధములేని కేవలాత్మజ్ఞానమును విధించుటకొఱకని యెట్లు తెలిసికొనఁబడుచున్నది?

మూ. అన్యార్థానవగమాత్ తథా చ పూర్వోక్తానాం దేవతానాం అగ్న్యాదీనాం సంసారిత్వం దర్శయిష్యతి అశనాయాది దోషవత్త్వేన "తమ్ అశనాపిపాసాభ్యాం అన్వవార్జత్" ఇత్యాదినాం అశనాయాదిమత్ సర్వం సంసార ఏవ, పరస్య తు బ్రహ్మణః అశనాయాద్యత్యయ శ్రుతేః.

తా. (సమాధానము) ఇతరప్రయోజనము లేనందువలననే యని తెలియఁదగినది. అట్లే మున్ను చెప్పఁబడిన అగ్న్యాది దేవతలకు ఆఁకలి దప్పులు మొదలగు దోషము లుండుటవలన జననమరణాదులతోఁ గూడినసంసారులనుటను గూర్చి "దానిని ఆఁకలిదప్పులతోఁ బొందించినాఁడు" (1-2-1) అనునీ మొదలగువానివలన నిరూపించుచున్నారు. క్షుత్పిపాసాదులతోఁ గూడిన



వన్నియు సంసార మనఁబడును. పరబ్రహ్మమునకు క్షుత్పిపాసాదులు లేవని శ్రుతి పల్కుచున్నది. (బృ-3-5-1)

మూ. భవతు ఏవం కేవలాత్మజ్ఞానం మోక్షసాధనమ్, నతు అత్ర అకర్మిణ ఏవ అధిక్రియతే; విశేషాశ్రవణాత్ అకర్మిణః ఆశ్రమ్యన్తరస్య ఇహ అశ్రవణాత్, కర్మ చ బృహతీసహస్రలక్షణం ప్రస్తుత్య అనన్తరమ్ ఏవ ఆత్మజ్ఞానం ప్రారభ్యతే, తస్మాత్ కర్మీ ఏవ అధిక్రియతే.

కర్మము చేయువాఁడే ఆత్మజ్ఞానాధికారి యని ప్రతివాది చెప్పుచున్నాఁడు.—

తా. ఇట్లు కేవలాత్మజ్ఞానమే ముక్తికి సాధనమై యుండునుగాక. "ఈజ్ఞానమునకు కర్మరహితుఁడగుసన్న్యాసిమాత్రమే అధికారి" యని ధ్రువపడలేదు. ఏలన, కర్మమును చేయువాఁడు అనుటకు వ్యతిరిక్తముగా కర్మమును చేయనివాఁడు అని యొకనిని గుఱించి శ్రుతి విభజించి చెప్పలేదు. కర్మము చేయని వేఱొక ఆశ్రమస్థుని ఇచ్చట చెప్పలేదు. మఱియు 'బృహతీసహస్రం' అను శస్త్రమే గుర్తుగాఁగల కర్మమును చెప్పిందొడంగి, అనంతరము ఆత్మజ్ఞానము ప్రారంభింపఁబడుచున్నది. కాఁబట్టి, కర్మమును జేయువాఁడే అధికారి యని దృఢమగుచున్నది.

మూ. న చ కర్మాసంబన్ధి ఆత్మవిజ్ఞానం, పూర్వవత్ అంతే ఉపసంహారాత్ యథా కర్మసంబన్ధినః పురుషస్య సూర్యాత్మనః స్థావరజఙ్గమాదిసర్వప్రాణ్యాత్మత్వం ఉక్తమ్ బ్రాహ్మణేన మంత్రే

ణ చ "సూర్య ఆత్మా" ఇత్యాదినా, తథైవ "ఏష బ్రహ్మైష ఇన్ద్రః" ఇత్యాదిడుపక్రమ్య సర్వప్రాణ్యాత్మత్వమ్ "యచ్చ స్థావరంసర్వం తత్ ప్రజ్ఞానేత్రమ్ ఇతి" ఉపసంహరిష్యతి తథాచ సంహితోపనిషది— "ఏతం హ్యేవ బహ్వృచా మహత్యుక్థే మీమాంసంతే" ఇత్యాదినా కర్మసంబన్ధిత్వం ఉక్త్వా "సర్వేషు భూతేషు ఏత మేవ బ్రహ్మే త్యాచక్షతే" ఇతి ఉపసంహరతి; తథా తస్య ఏవ "యో ఽయమ్ అశరీరః ప్రజ్ఞాత్మా" ఇతి ఉక్తస్య "యశ్చ అసౌ ఆదిత్యః ఏక మేవ తత్ ఇతి విద్యాత్" ఇత్యేకత్వం ఉక్తమ్ ఇహాపి "కో ఽయమాత్మా" ఇతి ఉప

క్రమ్య ప్రజ్ఞాత్మత్వ మేవ "ప్రజ్ఞానం బ్రహ్మ" ఇతి దర్శయిష్యతి; తస్మాత్ న అకర్మసంబన్ధి ఆత్మజ్ఞానమ్.

తా. (ఇట్లు ఆత్మజ్ఞానము కర్మసంబంధము లేనిదని యంగీకరించి "దానికి సన్న్యాసియే అధికారి" అని ప్రతివాది ఆక్షేపించి, ఇప్పుడు దానినంగీకరించక "ఆత్మజ్ఞానమునకు కర్మసంబంధము లేదు" అనుటను గూర్చి ఆక్షేపించుచున్నాఁడు.) ఈ ఆత్మజ్ఞానము కర్మసంబంధము లేనిదియు కాదు. ప్రారంభమునందు కర్మసంబంధమైన సర్వాత్మత్వము చెప్పినరీతిగానే అంతమునందును దానినే చెప్పి ముగించుటవలన నని తెలియఁదగినది. కర్మసంబంధము గలపురుషుఁడు, అనఁగా సూర్యుఁడు చరాచరాదిసకలప్రాణులయొక్క ఆత్మయని "సూర్యుఁడు ఆత్మ" అను నీ మొదలగువానివలన నెట్లు చెప్పఁబడినదో, అట్లు "ఈ బ్రహ్మము, ఈయింద్రుఁడు" (3-1-3) అను నీ మొద



లగువానిని ఉపక్రమించి (బ్రహ్మము) సకలప్రాణులయొక్క ఆత్మ అనుదానిని "ఏది అచరమో అదంతయు జ్ఞానమువలన (బ్రహ్మమువలన) కావింపఁబడుచున్నది" అని యుపసంహరింపఁ బోవుచున్నారు. అనఁగా సంహితోపనిషత్తునందును "ఋగ్వేదీయులు దీనినే మహత్యుక్థమునందు బృహతీసహస్ర మనెడిస్తోత్రమునందు విచారించుచున్నారు." ఇత్యాదులవలన కర్మసంబంధము గలదానిని చెప్పి, మరల "సకలప్రాణులయందును దీనినే బ్రహ్మమనెదరు" అని యుపసంహరించుచున్నారు. ఇట్లు "ఏది శరీరములేనిదో, జ్ఞానమైన యీ ఆత్మయే" అని చెప్పఁబడినదో, దానికే "మరల, ఏది యీసూర్యుఁడో, అది యొకటియే యని తెలియవలయును" అని ఏకత్వము

చెప్పఁబడినది. "ఈ ఆత్మ యెవరు?" (3-1-1) అని ప్రారంభించి (బ్రహ్మము) ప్రజ్ఞానమైనఆత్మయే "జ్ఞానము బ్రహ్మము" (3-1-3) అని కనఁబఱచుచున్నారు. కావున, ఆత్మజ్ఞానము కర్మసంబంధముగలదై యున్నది. (ఇత్యాది శ్రుతివాక్యములచే పూర్వాపరసందర్భములను విమర్శించి చూచునెడల, ఆత్మ కర్మసంబంధముగలదిగాఁ గనఁబడుచున్నది. కావున, దాని జ్ఞానమును కర్మసంబంధము కలది అని సిద్ధించుచున్నది. ఆనందగిరి)

మూ. పున రుక్త్యా ఽఽనర్థక్యమ్ ఇతి చేత్ —"కథం ప్రాణో వా అహ మస్మి ఋషే" ఇత్యాది బ్రాహ్మణేన "సూర్య ఆత్మా" ఇతి మన్త్రేణ చ నిర్ధారితస్య ఆత్మనః "ఆత్మా వా ఇదమ్" ఇత్యాది బ్రాహ్మణేన "కోఽయమాత్మా" ఇతి ప్రశ్న పూర్వకం పునః నిర్ధారణం పునరుక్తమ్ అనర్థకమ్ ఇతి చేత్.

వాది సంశయమును ప్రతివాదియే చెప్పి నిరాకరించుచున్నారు.—

తా. (ఆక్షేపము) చెప్పినదానినే చెప్పుటచేత ప్రయోజనములేదను దానిని వివరించుచున్నారు. "ఓమహర్షీ! నేనెట్లు ప్రాణముగనున్నాను?" అను బ్రాహ్మణముచేత "సూర్యుఁడు ఆత్మ" అను మంత్రముచే నిశ్చయింపఁబడిన ఆత్మ "ఇది ఆత్మగా" (1-1-1) అను బ్రాహ్మణముచేత "ఈ ఆత్మ ఎవఁడు?" (3-1-1) అని ప్రశ్నపూర్వకముగా మరల నిశ్చయించుట పునరుక్తిగాన ప్రయోజనము లేదని ఆక్షేపము కలుగఁగా.

మూ. న; తస్య ఏవ ధర్మాన్తరవిశేష నిర్ధారణార్థత్వాత్ న పునరుక్తతాదోషః; కథమ్? తస్యైవ కర్మసంబన్ధినః జగత్సృష్టిస్థితిసంహారాది ధర్మవిశేష నిర్ధారణార్థత్వాత్, కేవలోపాస్త్యర్థత్వాత్ వా అథవా ఆత్మేత్యాదిపరో గ్రన్థసందర్భః ఆత్మనః కర్మిణః కర్మణోఽన్యత్ర ఉపాసనాఽప్రాప్తౌ కర్మప్రస్తావే అవిహితత్వాత్ కేవలోఽపి ఆత్మా ఉపాస్యః ఇత్యేవ మర్థః. భేదాభేదోపాస్యత్వాచ్చ ఏకః ఏవ ఆత్మా కర్మవిషయే భేదదృష్టిభాక్ స ఏవ అకర్మకాలే అభేదేనాఽపి ఉపాస్యః ఇతి ఏవమ్ అపునరుక్తతా.

తా. (సమాధానము) అట్లు కాదు ఆయాత్మయొక్క ఇతరవిశేషములను నిర్ణయించుటకొఱకు చెప్పఁబడినందున పౌనరుక్త్యదోషము సంభ



వింపదు. ఎట్లన; కర్మసంబంధముగల ఆకేవలాత్మయే సృష్టిస్థితిసంహారాది ధర్మవిశేషములయొక్క నిర్ధారణముకొఱకని తెలియునది. లేక (కర్మసంబంధములేని) కేవలోపాసనకొఱకని తెలియునది, లేక ఆత్మకు కర్మకంటె వేఱొకదానియందు ఉపాసనము కలుగకయుండు నేని "ఇది ఆత్మగానే" (1-1-1) అని ప్రారంభించి యిఁక చెప్పఁబడు గ్రంథమంతయు "కేవలాత్మయైనను ఆయాత్మను ఉపాసింపవలయును" అను దానికొఱకనియు తెలియఁదగినది. ఇఁకను (ఉపాసింపఁదగినవారివలన తమకు) భేదముగను, (తమతో) అభేదముగను ఉపాసింపఁబడుటవలన, ఒకే ఆత్మ కర్మవిషయమునందు (కర్మముచేయునపుడు భేదదృష్టినిపొందినదై, అదే కర్మను చేయనప్పుడు అభేదముగా నుపాసింపఁబడుచున్నది. అని యిట్లు పౌనరుక్త్యదోషము లేకపోవుచున్నది.

మూ. "విద్యాం చావిద్యాం చ యః తత్ వేద ఉభయం సహ, అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే" ఇతి; "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" ఇతిచ వాజినామ్. నచ వర్షశతాత్ పరం ఆయుః మర్త్యానామ్ యేన కర్మపరిత్యాగేన ఆత్మానం ఉపాసీతం దర్శితం చ "తావన్తి పురుషాయుషః అహ్నాం సహస్రాణి భవన్తి" ఇతి. వర్షశతం చ ఆయుః కర్మణైవ వ్యాప్తమ్. దర్శితశ్చ మన్త్రః "కుర్వన్నేవేహ కర్మాణి" ఇత్యాదిః. తథా "యావజ్జీవం అగ్ని

హోత్రం జుహోతి" "యావజ్జీవం దర్శపూర్ణమాసాభ్యాం యజేత" ఇత్యాద్యాశ్చ "తం యజ్ఞపాత్రైః దహన్తి" ఇతి చ ఋణత్రయశ్రుతేశ్చ.

ఆత్మజ్ఞానమునకు సన్న్యాసమే తగినది యనుటనుగూర్చి శ్రుతులు పలువిధములుగా బోధించుచున్న దనుటను ప్రతివాది నిరూపించుచున్నాఁడు :—

తా. ఎవఁడు విద్య, అవిద్య అను నీరెంటిని ఎవఁడు క్రమముగాఁ దెలియుచున్నాఁడో వాఁడు మరణమును అవిద్యనుండి దాఁటి, మరణము లేమిని విద్యనుండి పొందుచున్నాఁడు. (ఈశావాస్యము 11)' అనియును,

"ఇచ్చట కర్మానుష్ఠానములను జేయుచు నూఱేండ్లు జీవించుటకుఁ గోరవలయును (ఈశ 2) అని వాజసనేయులు చెప్పెదరు. మనుష్యులు నూఱేండ్లకు తర్వాత కర్మమును సంపూర్ణముగా త్యజించి ఆత్మోపాసనము చేయవలయు నని లేదు. మనుజుని ఆయువు (360) వేల దినములుగా నున్నవి" అని (ఐతరేయారణ్యకమునందు) చెప్పఁ బడియున్నది. ఈనూఱేండ్లును కర్మమునే చేయవలయునని యంగీకరింపఁబడుచున్నది. "ఇచ్చట కర్మములను ఆచరించుచు" (ఈశ-2) అని ప్రారంభించెడిమంత్రమును జూపఁబడినది. ఇట్లే "జీవితమంతయు అగ్నిహోత్రము చేయుచున్నాఁడు" "ఆయుష్కాలమంతయు దర్శపూర్ణమాసముల చేత యజ్ఞము చేయుచున్నాఁడు." అను నివి మొదలైనవియును, "వానిని యాగపాత్రములుగా దహించెదరు" అనునదియును, దేవపితృఋషిఋణములను దీర్చవలయు నని శ్రుతియందు



(తై-సం-6-3-10-5) చెప్పఁబడినదియును జూడఁగా (ఆయుఃపర్యంతము గృహస్థుఁడై యుండవలయునే కాని సన్న్యాసమును అవలంబింపఁదగదు).

మూ. తత్ర పారివ్రాజ్యాదిశాస్త్రం "వ్యుత్థాయ అథ భిక్షాచర్యం చరన్తి" ఇతి ఆత్మజ్ఞానస్తుతిపరః అర్థవాదః, అనధికృతార్థో వా.

సన్న్యాసమును విధించు శ్రుతిస్మృతులకు ప్రతివాదికారణమును జెప్పుచున్నాఁడు :—

తా. ఇఁకను, సన్న్యసించి మరల భిక్షమెత్తుచున్నారు" (బృహ 3-5-1) అను సన్న్యాసము మొదలగువానియొక్క విధివాక్యము ఆత్మజ్ఞానస్తుతిపర మగుఅర్థవాదము. లేక, (కర్మమునందు) అధికారములేని (గ్రుడ్డివారు, కుంటివారు) మొదలగువారికొఱకని తెలియఁ దగినది. (అని ప్రతివాది ఆక్షేపము.)

మూ. న; పరమార్థవిజ్ఞానే ఫలాదర్శనే క్రియానుపపత్తేః.

ప్రతివాదివాక్యమును వాది నిరాకరించి ఆత్మజ్ఞానము కర్మకుఁ దగదనియును సన్న్యాసికే తగిన దనియును చెప్పుచున్నాఁడు :—

తా. అట్లు కాదు ; పరబ్రహ్మమును దెలిసికొన్నమీఁద, కర్మయొక్క ప్రయోజనము కనఁబడుటలేదు. (తాను పొందనిప్రయోజనమును పొందుటకొఱకు, దానికి సాధనమైన దానిని చేయుచున్నాఁడు. పరబ్రహ్మమును దెలిసికొన్నవాఁడు ఇఁక పొందవలసిన దేదియును లేదు. కాఁబట్టి వాఁడు కర్మ చేయవలసినది లేదు.) (అనం)

మూ. యదుక్తం "కర్మిణ ఏవచ ఆత్మజ్ఞానం కర్మసంబన్ధి చ" ఇత్యాది, తత్ న పరం హి ఆప్తకామం సర్వసంసారదోష వర్జితమ్ "బ్రహ్మాహమస్మి" ఇతి ఆత్మత్వేన విజ్ఞానే, కృతేన కర్తవ్యేన వా ప్రయోజనమ్ ఆత్మనః అపశ్యతః ఫలాదర్శనే క్రియా న ఉపపద్యతే.

తా. "ఆత్మజ్ఞానము కర్మము చేయువానికే తగినది, మఱియు కర్మ సంబంధము కలది" అను నిమొదలగువాక్యములు యుక్తమైనవి కావు. ఏలన, సంసారదుఃఖము కొంచెమైనను లేని పరిపూర్ణ మగుపరమాత్మను "నేను పరమాత్మగానున్నాను" అని తనఆత్మను దెలిసికొనినమీఁద, కర్మముతోఁ గాని, కర్మము చేయుటతోఁ గాని తనకు ప్రయోజనము కనంబడనందున వానికి కర్మముతో పనిలేదు.

మూ. ఫలాదర్శనే ఽపి నియుక్తత్వాత్ కరోతి ఇతిచేత్.

తా. (ఆక్షేపము) ప్రయోజనము కనఁబడకపోయినప్పటికిని, కర్మము చేయవలయునని శ్రుతివిధించియుండుటం బట్టి కర్మ చేయుచున్నాఁడు అని చెప్పితివేని,—(అట్లనఁ గూడదు)

మూ. న; నియోగావిషయాత్మదర్శనాత్ ఇష్టయోగం అనిష్టవియోగం చ ఆత్మనః ప్రయోజనం పశ్యన్ తదుపాయార్థీ యో భవతి, సః నియోగస్య విషయో దృష్టః లోకే; నతు తద్విపరీతః నియోగావిషయ బ్రహ్మాత్మత్వదర్శీ బ్రహ్మాత్మత్వదర్శీ అపి సన్ చేత్ నియుజ్యేత నియోగావిషయో ఽపి సన్, న కశ్చిత్ న నియుక్తః ఇతి సర్వంకర్మ సర్వేణ సర్వదా కర్తవ్యం ప్రాప్నోతి తచ్చ అనిష్టమ్.



తా. (సమాధానము) అట్లు కాదు, విధికి(నియమమునకు)లోఁబడని ఆత్మదర్శనము కలిగినందువలన నని తెలియునది. కావలసినదిసంప్రాప్తించుటయును, అక్కఱలేనిది సంప్రాప్తము కాకపోవుటయునుమాత్రమే స్వప్రయోజనమని చూచువాఁడుగను, వాని సాధనములను గోరువాఁడుగను ఎవఁడుండునో, వాఁడు విధికి లోఁబడినవాఁడుగాఁ గనంబడుచున్నాఁడు. అయినను, వానికి వేఱైనవాఁడుగను విధికిలోఁబడని పరబ్రహ్మమును స్వాత్మగాఁజూచెడిస్వభావముగలవాఁడుగను అగుటలేదు. పరబ్రహ్మమును తన్నుగాఁ జూచువాఁడు విధికిఁ లోఁబడిన వాఁడుకాఁడు. ఎవఁడును విధికి లోఁబడనియెడల కర్మము చేయుటను ఇష్టమొందఁడు. కావున అందఱును సర్వదా కర్మ చేయవలయునని సిద్ధించుచున్నది. ఇది వాదిప్రతివాదులమగు మనయిర్వురకును అనిష్టముగాన అంగీకారము కానేరదు.

మూ. న చ సః నియోక్తుం శక్యతే కేనచిత్ ఆమ్నాయస్యాపి నత్ప్రభవత్వాత్, నహిస్వవిజ్ఞానోత్థేన వచసా స్వయం నియుజ్యతే, నాపి బహువిత్ స్వామీ అవివేకినా భృత్యేన.

ఆత్మజ్ఞానికి విధివిహితములు లేవనుచున్నారు.—

తా. మఱియు ఆత్మజ్ఞానిని ఏదియువిధింపదు. ఎవఁడును వానిని నియమింపఁడు. వేదమునకు వాఁడే స్థానము గనుక, తన్ను విధించువారు లేరు. సర్వజ్ఞుఁడైన ప్రభువు అవివేకియగు సేవకునిచే నియమింపఁబడఁడు కదా.

(తన్ను తాను బ్రహ్మ మని యెఱింగినవానిని నియమించువా రుండరు కదా. వేదము ఇతరులకు విధించునట్లు బ్రహ్మజ్ఞానిని కర్మము చేయునట్లు విధింప కుండుటకు హేతువేమి? అనఁగా, చేయించువాఁడే చేయఁడుకదా? వేదమున కంటె మహాధికుఁడగు. ఆత్మజ్ఞాని యీశ్వరతుల్యుఁ డని తెలియునది. ఆనందగిరి.)

మూ. ఆమ్నాయస్య నిత్యత్వే సతి స్వాతంత్ర్యాత్, సర్వాన్ ప్రతి నియోక్తృత్వ సామర్థ్యం ఇతిచేత్.

తా. (ఆక్షేపము) వేదము నిత్యముగాన, అది యెల్లవారిని నియమించుటకు (దానికి) అధికారముకలదు.

మూ. న, ఉక్తదోషాత్, తథాఽపి సర్వేణ సర్వదా సర్వమ్ అవశిష్టం కర్మకర్తవ్యమ్ ఇతి ఉక్తోదోషోఽపి అపరిహార్య ఏవ.

తా. (సమాధానము) దిగువ చెప్పఁబడినదోషమువలన నని యెఱుంగునది "అందఱును అన్నికర్మలవు భేదములేక సదా చేయవలయును." అని చెప్పఁబడినదోషమును పరిహరించుటకుఁ గాదు. (దీనిని పైన "ననియోగావిషయాత్మదర్శనాత్" అనుమూలమునకు వ్రాయఁబడిన తాత్పర్యమునందుఁ గనందగును.

మూ. తదపి శాస్త్రేణైవ విధీయతే ఇతి చేత్ యథాకర్మ కర్తవ్యతా శాస్త్రేణ కృతా, తథా తదపి ఆత్మజ్ఞానం తస్యైవ కర్మిణః శాస్త్రేణ విధీయతే ఇతిచేత్.



జ్ఞానమునకు కర్మముతో సంబంధములేదు.—

తా. (ఆక్షేపము) అదియు శాస్త్రముచేతనే విధింపఁబడుచున్నది. అనఁగా, కర్మము చేయవలయుననున దెట్లు శాస్త్రముచే విధింపఁబడుచున్నదో, అట్లే ఆత్మజ్ఞానమును కర్మునకే విధింపఁబడియున్నది, అనఁగా—

మూ. న, విరుద్ధార్థ బోధకత్వానుపపత్తేః, నహి ఏకస్మిన్ కృతాకృతాసంబన్ధిత్వం తద్విపరీతత్వం చ బోధయితుం శక్యమ్, శీతోష్ణతామ్ ఇవ అగ్నేః.

తా. (సమాధానము)అట్లుకాదు. (శాస్త్రము)విరుద్ధార్థములను బోధించుననుటసరికాదు. చేసినదానితోను చేయఁబడనిదానితోను (ఇఁక చేయఁబడు దానితోను) లేని ఆత్మజ్ఞానమునకు సంబంధములేదు. అగ్నికి శీతోష్ణత్వము చెప్పుటకు వీలుకానట్లు చెప్ప శక్యముకాదు. (ఎప్పుడు తాను కర్తగాననెడి నిశ్చయముకలవాఁడైనాఁడో, అప్పుడు తనకు కర్మముతో సంబంధములేదు. కాఁబట్టి వాఁడు ఇదివఱకు చేసిన కర్మఫలమునకును ఇంకచేయఁబోవుకర్మమునకును బాధ్యుఁడు కాఁడు. అగ్నికి చల్లఁదనమును ఉష్ణమునువలె నని తెలియునది. ఆనందగిరి.)

మూ. న చ ఇష్టయోగ చికీర్షా ఆత్మనః అనిష్టవియోగచికీర్షా చ శాస్త్రకృతా, సర్వప్రాణినాం తద్దర్శనాత్, శాస్త్రకృతం చేత్ — తత్ ఉభయం గోపాలాదీనాం న దృశ్యేత, అశాస్త్రజ్ఞత్వాత్ తేషామ్. యత్ హి స్వతః అప్రాప్తం, తత్ శాస్త్రేణ బోధయితవ్యమ్, తత్ చేత్ కృతకర్తవ్యతా విరోధి

ఆత్మజ్ఞానం శాస్త్రేణ కృతమ్ కథం తద్విరుద్ధాం కర్తవ్యతాం పునః ఉత్పాదయేత్? శీతతామ్ ఇవ అగ్నౌ, తమ ఇవచ భానౌ.

కర్మములచేఁ దనకు ప్రయోజనము లేనందున జ్ఞాని దానిని చేయుటలేదు.—

తా. మఱియు తనకు ఇష్టప్రాప్తిఫలేచ్ఛయును, అనిష్టపరిహారఫలేచ్ఛయును శాస్త్రవిహితముకాదు. సకలప్రాణులకును స్వయముగాఁ గనంబడుచుండుటం బట్టి ఇష్టానిష్టములు శాస్త్రకృతముకాదు. అవి రెండును శాస్త్రకృతము లగునేని, శాస్త్రము తెలియని గొల్లవారు మొదలగువారికి అవి స్వయముగాఁగలుగక పోవలయును. ఏది స్వయముగా పొందఁబడదో అని శాస్త్రముచేతనే తెలిసికొనఁ దగినది. కర్మవిరోధి యగు ఆత్మజ్ఞానము శాస్త్రకృతమైనయెడల అట్టి ఆత్మతత్త్వజ్ఞానము కలుగుచుండఁగా ఇది చేయఁబడినది, ఇది చేయఁదగినది అని ఆత్మజ్ఞానమునకు విరోధమగు కర్మజ్ఞానము, మరల శాస్త్రముచేత అగ్నియందు చల్లఁదనమును, సూర్యునియందు చీఁకటియు వలెనే ఎట్లువిధింపఁబడును? అనఁగా విధింపఁబడదు. (ఇది చేసినయైనది, ఇఁక దీనిని చేయవలయును. అనెడి తెలివి, అకర్త యగు ఆత్మజ్ఞానమునకు విరోధము. అ)

మూ. న బోధయత్యేవ ఇతిచేత్.

తా. ([ఆక్షేపము] శాస్త్రము ఇట్లు) బోధింపలేదని చెప్పితివేని—

మూ. న "స మే ఆత్మా ఇతి విద్యాత్" "ప్రజ్ఞానం బ్రహ్మ" ఇతి చ,



ఉపసంహారాత్ "తదాత్మానమేవ అవేత్" "తత్త్వమసి" ఇత్యేవమాది వాక్యానాం తత్పరత్వాత్ ఉత్పన్నస్యచ బ్రహ్మాత్మవిజ్ఞానస్య అబాధ్యమానత్వాత్ న అనుత్పన్నం భ్రాన్తం వా ఇతి శక్యం వక్తుమ్.

తా. (సమాధానము) అట్లుకాదు. "అది నాయాత్మయని తెలియవలయును" (కౌషీ-3-8) అనియును "జ్ఞానమే బ్రహ్మము"(ఐ-3) అని ముగించియుండుటవలన నని తెలియునది. "దానిని ఆత్మగానే తెలియవలయును." (బృ 1-4-10) "నీవు అదిగానున్నావు" (ఛాం 6-8-7) అను ని మొదలగువాక్యములు ప్రమాణములుగానుండుటం బట్టి అట్లనరాదు. మఱియు "బ్రహ్మమే ఆత్మ అని కలిగిన జ్ఞానము బాధింపఁబడనందున ఆత్మజ్ఞానము కలుగదనిగాని, భ్రాంతియనిగాని చెప్పుటకు శక్యముకాదు. (వేదమునందు ఆత్మను కర్తగాఁ జెప్పిన కర్మకాండము వాస్తవమునందు అకర్త యగు ఆయాత్మస్వరూపమును దెలియఁజేయుటకు ఉపాయముగాన, జ్ఞానకాండమునకు విరుద్ధము కాదు. అనం)

మూ. త్యాగేఽపి ప్రయోజనాభావస్య తుల్యత్వమ్ ఇతిచేత్, "నాకృతేనేహ కశ్చన" ఇతిస్మృతేః, యే ఆహుః "విదిత్వా బ్రహ్మావ్యుత్థాన మేవ కుర్యాత్" ఇతి, తేషామ్ అపి ఏషః సమానో దోషః ప్రయోజనాభావః ఇతిచేత్—

సన్న్యాసము జ్ఞానియొక్క స్వభావము.—

తా. (ఆక్షేపము) చేయకపోయినందున నేఫలమును లేదు. (గీత 3-18)

అను స్మృతిచేత, సన్న్యాసముచేతను నేఫలమును లేదుకదా? అనఁగా— "బ్రహ్మమును దెలిసికొన్నతర్వాత సన్న్యసింపవలయును" అని యెవరు చెప్పిదురో వారికిని ఫలము లేదనెడి యాదోషము సిద్ధించుచున్నది. (అనఁగా జ్ఞానికి కర్మమునందు ఫలము లేనప్పుడు, సన్న్యాసమునందును ఫలము లేక పోవలయును కదా; అనఁగా)—

మూ. న; అక్రియామాత్రత్వాత్ వ్యుత్థానస్య, అవిద్యానిమిత్తో హి ప్రయోజనస్య భావః, న వస్తు ధర్మః సర్వప్రాణినాం తద్దర్శనాత్, ప్రయోజనతృష్ణయాచ ప్రేర్యమాణస్య వాఙ్మనః కాయైః ప్రవృత్తి దర్శనాత్, "సోఽకామాయత జాయా మే స్యాత్" ఇత్యాదినా పుత్రవిత్తాది పాంక్తలక్షణం కామ్యమేవ ఇతి "ఉభే హ్యేతే సాధ్య సాధనలక్షణే ఏషణే ఏవ ఇతి వాజసనేయి బ్రాహ్మణే అవధారణాత్, అవిద్యా కామదోష నిమిత్తాయాః వాఙ్మనః కాయప్రవృత్తేః పాంక్తలక్షణాయాః విదుషః అవిద్యాదిదోషాభావాత్ అనుపపత్తేః క్రియాఽభావమాత్రం వ్యుత్థానం, నతు యాగాదివత్ అనుష్ఠేయరూపం భావాత్మకమ్, తచ్చ, విద్యావత్పురుషధర్మః ఇత్యతః న ప్రయోజనమ్ అన్వేష్టవ్యమ్, నహి తమసి ప్రవిష్టస్య ఉదితే ఆలోకే యత్ గర్తపఙ్కకణ్టకాద్యపతనం తత్ కిం ప్రయోజనమ్ ఇతి ప్రశ్నార్హమ్.



తా. (సమాధానము) అట్లుకాదు. వ్యాపార (కామ్య) రహితమైనది సన్న్యాస మనఁబడును. ఫలము నపేక్షించుట అజ్ఞానస్వభావము. అది ఆత్మజ్ఞానస్వభావము కాదు. సకలప్రాణులయందును కామ్యము కనఁబడుచుండుటం బట్టి (అది అజ్ఞానముచేతనే యని తెలియునది. కామ్యేచ్ఛచే ప్రేరేపింపఁబడినవాఁడు వాక్కు మనస్సు కాయము అనువీనిలో నేదేని యొక కరణముతోఁ జేయుటను చూచుచున్నాము. మఱియు పుత్త్రులు సంపద మొదలగునవియు కామ్యమేగాని వేఱుకాదు. "నాకు భార్యకావలయును" అని వాఁడు కోరినాఁడు (బృ. 1-4-17) అను నీ మొదలగువానివలన "సాధ్యమును సాధనము నగు నీ రెండును కామ్యమే యగును" (బృ. 3-5-1) అని వాజసనేయ బ్రాహ్మణమందు చెప్పఁబడియున్నది. కావున, త్రికరణములతోఁ జేయునట్టి కార్యము లన్నియు, అజ్ఞానమును కామమునను దోషములచేతనే కలుగుచున్నది. పుత్త్రుఁడు, ధనము, అజ్ఞానము ఇవి మొదలగునవి జ్ఞానికి లేదు. ప్రయోజనాపేక్ష అజ్ఞానికే గాని ఆత్మజ్ఞానికి లేదు. ఇట్టి అపేక్ష ఆత్మధర్మమును గాదు. సన్న్యాస మనునది క్రియాశూన్యమైనది. యజ్ఞాదులవలె ఫలాపేక్షతోఁ గూడినది గాదు. ఆత్మజ్ఞానిఫలమును గోరుటకాదు. అతనికి ఫలాపేక్ష లేదు. చీఁకటిలోఁ బోవువానికి, వెలుతురు కనఁబడినవెంటనే పల్లము అడుసు ముండ్లు మొదలగువానియందుఁ బడక పోవుటయేల? అని యడుగుట యెట్లు యుక్తము కాదో, అట్లు ఆత్మజ్ఞానముగల పురుషార్థప్రదమైన సన్న్యాసమునకు ఫలమును వెదకుట యుక్తము కాదు.

మూ. వ్యుత్థానం తర్హి అర్థప్రాప్తత్వాత్ న చోదనార్హమ్ ఇతి,

గార్హస్థ్యే చేత్ పరబ్రహ్మవిజ్ఞానం జాతం, తత్ర ఏవ అస్తు అకుర్వతః ఆసనం, న తతః అన్యత్ర గమనమ్ ఇతిచేత్.

గృహస్థధర్మము ఆశచేఁ గల్గుచున్నది.—

తా. (ఆక్షేపము) అప్పుడు, సన్న్యాసము. ధనముచేఁ గల్గుటవలన విధింపఁదగినది లేదు. కాఁబట్టి, ఆత్మజ్ఞానము గృహస్థాశ్రమమునందే తనంతట కలుగునెడల విత్తాదులయం దభిలాష లేకయే గృహస్థధర్మమునందే యుండవచ్చును. ఇతరాశ్రమమును గోరవలసినది లేదు. అనఁగా.

మూ. న, కామప్రయుక్తత్వాత్ గార్హస్థస్య, "ఏతావాన్ వై కామః" ఇతి. "ఉభే హ్యేతే ఏషణే ఏవ" ఇతి అవధారణాత్, కామనిమిత్తపుత్రవిత్తాది సంబన్ధనియమాభావమాత్రం, నహి తతః అన్యత్ర గమనం, వ్యుత్థానమ్ ఉచ్యతే, తతః న గార్హస్థ్యే ఏవ అకుర్వతః ఆసనమ్ ఉత్పన్నవిద్యస్య.

తా. (సమాధానము) అట్లు కాదు. గృహస్థధర్మము కామము చేతనే కల్గినది. "ఇంతయే కామము" (బృ. 1-4-17) అనియు, "ఈ రెండును ఆశయే" (బృ. 3-5-1) అనియును స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. కామముచేఁ గల్గినపుత్రవిత్తాదిసంబంధము నియతముగా నశించుటయే సన్న్యాస మనఁబడుచున్నది. కావున, గృహస్థాశ్రమమునుండి వేఱే ఆశ్రమమునకుఁ బోవుట సన్న్యాస మనఁబడదు. బ్రహ్మజ్ఞానము కలిగిన మీఁద కర్మములను జేయక గృహస్థాశ్రమమునందే యుండుటయు సన్న్యాసము కాదు.



మూ. ఏతేన గురుశుశ్రూషాతపసోః అపి అప్రతిపత్తిః విదుషః సిద్ధా.

తా. ఇందువలన, జ్ఞాని గురుశుశ్రూష, తపస్సు, అనువీనిని చేయని వాఁడగుచున్నాఁడు. (అనఁగా ఆత్మజ్ఞానికి దేనియందును కోరిక లేనందున వాఁడు గురుశుశ్రూషాదులయందును కోరికలేనివాఁడగుచున్నాఁడు. అనుట సరికాదు.)

మూ. తత్ర కేచిత్ గృహస్థాః భిక్షాటనాదిభయాత్ పరిభవాచ్చ త్రస్యమానాః సూక్ష్మదృష్టితాం దర్శయన్తః ఉత్తరమ్ ఆహుః "భిక్షో రపి భిక్షాటనాదినియమదర్శనాత్ దేహధారణమాత్రార్థినః, గృహస్థస్యాపి సాధ్యసాధనైషణోభయవినిర్ముక్తస్య దేహమాత్రధారణార్థమ్ అశనాచ్ఛాదనమాత్రమ్ ఉపజీవతః గృహే ఏవ అస్తు ఆసనమ్" ఇతి.

తా. (పూర్వపక్షము) ఇందు, కొందఱు సన్న్యాసులు భిక్ష మెత్తి భుజించుట మొదలగువానిభయమువలనను, ఇతరులు చేయుపరిహాసమువలనను భీతినొందినవారై, తమసూక్ష్మబుద్ధినిఁ గనఁబఱచువారై యిట్లు ప్రత్యుత్తర మిచ్చెదరు:—శరీరధారణముకొఱకు మాత్రమే భిక్ష మెత్తవలసినదని సన్న్యాసికి నియమముండుటంబట్టి, గృహస్థుఁడును శరీరధారణార్థమై అన్నవస్త్రములను మాత్రము కోరువాఁడై గృహమందే యుండును గాక, అని కొందఱు గృహస్థులనెదరు.

మూ. న, స్వగృహాది శేషపరిగ్రహనియమస్య కామప్రయుక్తత్వాత్ ఇతి ఉక్తోత్తర మేతత్, స్వగృహాదిశేషపరిగ్రహాభావే చ శరీరధారణమాత్రప్రయుక్తాశనాచ్ఛాదనార్థినః స్వపరిగ్రహాది శేషాభావే అర్థాత్ భిక్షుకత్వ మేవ.

తా. (సిద్ధాంతము) అట్లనుట సరికాదు. ఏలన, తనకొఱకు శ్రేష్ఠమైన గృహమునుంచికొని భార్యతోఁ గూడనుండుట ఆశచేతనే యనియున్నె చెప్పఁబడినది. భార్య లేనియెడల శరీరధారణమునకు మాత్రము అన్నవస్త్రములు కావలయునని కోరెడివానికి తనదియనెడి యొకశ్రేష్ఠమగువస్తువే లేదు కావున, వాఁడు వాస్తవముగా సన్న్యసి యేయగును.

మూ. శరీరధారణార్థాయ భిక్షాటనాదిషు ప్రవృత్తౌ యథా నియమః భిక్షోః శౌచాదౌ చ, తథా గృహిణః అపి విదుషః అకామినః అస్తు నిత్యకర్మసు నియమేన ప్రవృత్తిః, యావజ్జీవాదిశ్రుతి నియుక్తత్వాత్ ప్రత్యవాయపరిహారాయ ఇతి.

తా. శరీరధారణార్థభిక్ష మెత్తుట మొదలగు నవియును, శరీరశుద్ధి మొదలగువానియందును సన్న్యసి కెట్లునియమము కలదో, అట్లే కోరికలు లేని బ్రహ్మజ్ఞానియగుగృహస్థుఁడును నిత్యకర్మములను నియమముగాఁ జేయవలసినది. గృహస్థుఁడు జీవితకాలమంతయు అగ్నిహోత్రము చేయవలయునని నియమముకలదు. గృహస్థునకు ప్రత్యవాయదోషపరిహారార్థమై వేదమునందు అగ్నిహోత్రము విధింపఁబడియున్నది.



మూ. ఏతత్ నియోగావిషయత్వేన విదుషః ప్రత్యుక్తమ్, అశక్యనియోజ్యత్వాచ్చ ఇతి.

తా. (సిద్ధాంతము) ఆత్మజ్ఞాని విధికి లోఁబడినవాఁడు కాఁడు. అని ప్రత్యుత్తరమీయఁబడినది. మఱియు, ఆత్మజ్ఞానిని విధించుటకు శక్తిగలవారు లేరు. (అనఁగా విధికి లోఁబడఁడు).

మూ. యావజ్జీవాదినిత్యచోదనానర్థక్యమ్ ఇతిచేత్.

తా. (ఆక్షేపము) "యావజ్జీవమును" అను శ్రుతి నిత్యకర్మమును విధించుట ప్రయోజనము లేనిదగుచున్నది. అనఁగా—

మూ. న, అవిద్వద్విషయత్వేన అర్థవత్త్వాత్, యత్తుభిక్షోః శరీరధారణమాత్ర ప్రవృత్తస్య ప్రవృత్తేః నియతత్వం, తత్ ప్రవృత్తేః న ప్రయోజకమ్, ఆచమనప్రవృత్తస్య పిపాసాపగమవత్, న అన్యప్రయోజనార్థత్వమ్ అవగమ్యతే, న చ అగ్నిహోత్రాదీనాం తద్వత్ అర్థప్రాప్తప్రవృత్తినియతత్వోపపత్తిః.

తా. (సమాధానము) అట్లనఁ గూడదు. ఏలన, ఈయావజ్జీవాదిశ్రుతి సార్థకమై యున్నది. శరీరధారణార్థమై సన్న్యసి ప్రవృత్తికి చెప్పఁబడిన నియమ మెద్దియో, అది సన్న్యాసిప్రవృత్తికి (ప్రయత్నమునకు) కారణము (ప్రయోజకము) కాదు. ఆచమనము చేయువానికి దాహము తీరుట ప్రయోజనముకానట్లు జీవనార్థమై భిక్షాటనమునందుఁ బ్రవర్తించిన సన్న్యసికిఁ జెప్పఁబడిన నియమము భిక్షాదిప్రవృత్తికి ప్రయోజకము కాదు. అప్రకా

రమే అగ్నిహోత్రాదిప్రవృత్తి అర్థప్రాప్తిప్రవృత్తికి ఉపయోగము లేదు. (సన్న్యాసికి కర్మగాని భిక్షాటనము గాని లేదనిభావము.)

మూ. అర్థప్రాప్తప్రవృత్తినియమో ఽపి ప్రయోజనాభావే అనుపపన్నః ఏవ ఇతిచేత్ —

తా. (ఆక్షేపము) తనంతటసిద్ధించినకార్యమునకు నియమవిధి ప్రయోజనము కాకపోయినప్పుడు అది ఉపయోగమైనది కాదు; అనఁగా—

మూ. న, తన్నియమస్య పూర్వప్రవృత్తి సిద్ధత్వాత్, తదతిక్రమే యత్నగౌరవాత్, అర్థప్రాప్తస్య వ్యుత్థానస్య పునర్వచనాత్ విదుషః కర్తవ్యోపపత్తిః.

తా. (సమాధానము) అట్లనరాదు. ఏలన, అనియమవిధి ఆత్మజ్ఞానమునకు పూర్వమే సిద్ధమైయున్నది. కావున, దానిని అతిక్రమించుట సన్న్యాసికి ధర్మము కాదు. (నియమమును ఉల్లంఘించుటకుఁ బ్రయత్నించుటకంటె నియమముచొప్పున నడుచుకొనవలయు నని పూర్వము నుండియే ఆత్మజ్ఞాని యెఱింగియున్నవాఁడు గాన, అతిక్రమించి వర్తించుటకు ప్రయత్నింపఁడు. అ.)

మూ. అవిదుషాపి ముముక్షుణా పారివ్రాజ్యం కర్తవ్య మేవ, తథాచ "శాన్తో దాన్తః" ఇత్యాదివచనం ప్రమాణమ్, శమదమాదీనాం చ ఆత్మదర్శనసాధనానామ్ అన్యాశ్రమే తు అనుపపత్తేః "అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం ప్రోవాచ సమ్యగృషిసంఘజుష్టమ్" ఇతి చ శ్వేతాశ్వతరో విజ్ఞాయతే, "న



కర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః" ఇతిచ కైవల్యశ్రుతిః, "జ్ఞాత్వా నైష్కర్మ్యమాచరేత్" ఇతిచ స్మృతేః, "బ్రహ్మాశ్రమపదే వసేత్" ఇతి చ, బ్రహ్మచర్యాది విద్యాసాధనానాం చ సాకల్యేన అత్యాశ్రమిషు ఉపపత్తేః, గార్హస్థ్యే అసంభావాత్, న చ అసంపన్నం సాధనం కస్య చిత్ అర్థస్య సాధనాయ అలమ్.

ఆత్మను తెలియఁగోరువాఁడు సన్న్యసింపఁదగినది.—

తా. (సంసారమునుండి) తరింపఁగోరునట్టి అజ్ఞాని సన్న్యసింపవల

యును. అట్లే "ఓర్పుగలవాఁడు, అణఁకువగలవాఁడు" (బృ. 4-4-23) అను వాక్యము ప్రమాణముగ నున్నది. ఆత్మజ్ఞానమునకు సాధనములైన శమదమాదిగుణములు సన్న్యాసులకే తగియున్నదిగాని గృహస్థాద్యాశ్రమస్థులకు తగినదికాదు. కావున, ముఖ్యముగా "జ్ఞానులచే విధింపఁబడిన యీధర్మము అత్యాశ్రమస్థులకును విధింపఁబడినది" (శ్వేతా. 6-21) అని, శ్వేతాశ్వతరోపనిషత్తునందు చెప్పఁబడియున్నది. అమృతత్వమును జెందుట కర్మచేతను, దారపుత్రాదులచేతను, ధనముచేతను కాదు. కొందఱు అమృతత్వమును సన్న్యాసముచేఁ బొందిరి. (కై. 2.) అని కైవల్యోపనిషత్తునందు చెప్పఁబడియున్నది. "తెలిసికొని, కర్మరహితస్థితిని అనుష్ఠింపవలయును" అనియును "బ్రహ్మమును దెలిసికొనుటకు, సాధనమైన సన్న్యాసాశ్రమమును బొందవలయును" అనియును స్మృతియందు జెప్పఁబడియున్నది. మఱియు బ్రహ్మచర్యము మొద

లగు జ్ఞానసాధనములు అత్యాశ్రమస్థులయొద్దనే సంపూర్ణముగాఁ గనంబడుటంబట్టియు, గృహస్థాశ్రమమందుఁ గనంబడకుండుటంబట్టియు, సమగ్రమై సాధింపఁదగనిసాధనము ప్రయోజనము కానేరదు.

**మూ.** యత్ విజ్ఞానోపయోగీని చ గార్హస్థ్యాశ్రమకర్మాణి, తేషాం పరం ఫలమ్ ఉపసంహృతమ్ దేవతాప్యయలక్షణం సంసారవిషయమేవ, యదికర్మణః ఏవ పరమాత్మ విజ్ఞానమ్ అభవిష్యత్, సంసారవిషయస్యైవ ఫలస్య ఉపసంహారః న ఉపాపత్స్యత్.

కర్మసంబంధజ్ఞానము సంసారమును కలుగఁజేయును.—

తా. ఇఁక గృహస్థధర్మమునకు దగినకర్మములలో జ్ఞానమున కేవేనియు పయోగమగునో (దానినిఁ గూర్చి చెప్పఁబడును.) వానియొక్క ముఖ్యప్రయోజనము దేవతలను బొందుట యనెడి సంసారమును గూర్చినదిగానే ఉపసంహరింపఁబడినది. కర్మచేతనే పరమాత్మజ్ఞానము కలుగునెడల, దాని ప్రయోజనము సంసారవిషయముగా ఉపసంహరింపఁబడకయే యుండును. (అనఁగా కర్మము ముక్తికి సాధనము కాదు.)

**మూ.** అఙ్గఫలం తత్ ఇతిచేత్.—

తా. (ఆక్షేపము) అది అంగముయొక్క ఫలము, అనఁగా (పరమాత్మజ్ఞానము అంగి, దానిఫలము మోక్షము. అగ్న్యాదిదేవతాజ్ఞానము అంగము. దానిఫలముసంసారము. కాఁబట్టి, అంగాంగిస్థితివలన విరోధములేదు. అనం)



**మూ.** న; తద్విరోధ్యాత్మవస్తువిషయత్వాత్ ఆత్మవిద్యాయాః, నిరాకృత సర్వనామరూపకర్మపరమార్థాత్మవస్తు విషయం జ్ఞానమ్ అమృతత్వసాధనమ్, గుణఫలసంబంధే హి నిరాకృత సర్వవిశేషాత్మ వస్తువిషయత్వం విజ్ఞానస్య న ప్రాప్నోతి, తచ్చ అనిష్టమ్, "యత్ర త్వస్య సర్వ మాత్మైవా౽భూత్" ఇతి అధికృత్య క్రియాకారకఫలాదిసర్వ వ్యవహారనిరాకరణాత్ విదుషః, తద్విపరీతస్య అవిదుషః "యత్రహి ద్వైత మివ" ఇతి ఉక్త్వా క్రియాకారకఫలరూపస్య ఏవ సంసారస్య దర్శితత్వాచ్చ వాజసనేయిబ్రాహ్మణే, తథా ఇహా౽పి దేవతాప్యయం సంసారవిషయం యత్ఫలమ్ అశనాయాది మదవస్త్వాత్మకం, తత్ఫలమ్ ఉపసంహృత్య కేవల సర్వాత్మకవస్తువిషయం జ్ఞానమ్ అమృతత్వాయ వక్ష్యామి ఇతి ప్రవర్తతే.

తా. (సమాధానము) అట్లు కాదు. ఆత్మజ్ఞానము అంగాదులకు విరోధియైన ఆత్మవస్తువే విషయముగాఁ గలది యగుటంబట్టియు, నామరూపకర్మములుగల పరమార్థమైన ఆత్మవస్తువు ముక్తికి సాధనముగానున్నది. అంగముయొక్క సంబంధము ఫలసంబంధమును గలదిగానుండుటంజేసి (జ్ఞానమునకు కర్మసంబంధము అనిష్టముగానుండుటంజేసి) నిరాకరింపఁబడిన ఆత్మవస్తువును విషయమగుటలేదు. ఏలన, అసంబంధము అనిష్టమైనది. అనఁగా ఇష్టమైనది కాదు. 'ఎచ్చట వీనికి సమస్తము ఆత్మగానుండినదో' (బృ. 2-4-44; 4-5-11) అనెడి శ్రుతిప్రకారము క్రియాకారకఫలాది సమస్తవ్యవహారమును నిరాక

రించుటవలనను, జ్ఞానికి వ్యతిరిక్తమైన అజ్ఞానికి «ఎచ్చటద్వైతము వలె» (బృ. 2-4-14) అని క్రియాకారకఫలరూపమైన సంసారమును వాజసనేయబ్రాహ్మణమునందు గనంబఱచుటవలనను, అప్రకారమే ఐతరేయోపనిషత్తునందుఁ గూడ క్షుత్పిపాసాదికము గల వస్తుస్వరూపమును దేవతాప్రాప్తిలక్షణమును సంసారవిషయమునకు ఫలమేదియో దానినే యిచ్చట ముగింపఁబడియున్నది. «సర్వమును ఆత్మస్వరూపమైన కేవలపరబ్రహ్మమును గూర్చిన జ్ఞానమును అమృతత్వమునకై చెప్పెదను» అని యుపక్రమించుచున్నారు.

మూ. ఋణప్రతిబంధశ్చ అవిదుష ఏవ మనుష్య పితృదేవ లోకప్రాప్తిం ప్రతి, న విదుషః, «సో ఽయం మనుష్యలోకః పుత్రేణైవ» ఇత్యాది లోకత్రయసాధన నియమశ్రుతేః, విదుషః చ ఋణప్రతిబన్ధాభావో దర్శితః ఆత్మలోకార్థినః «కిం ప్రజయా కరిష్యామః» ఇత్యాదినా తథా «ఏతద్ధస్మ వై తత్పూర్వే విద్వాంసః అగ్నిహోత్రం న జుహవాంచక్రుః» ఇతి చ కౌషీతకీనామ్.

ఋణ మనునది ముక్తినిఁ గోరని అజ్ఞానికేయనుట.

తా. మనుష్య పితృదేవలోకమును బొందెడివిషయమునందు ఋణప్రతిబంధకము అజ్ఞానికే గాని జ్ఞానికి గాదు. "ఆ ఈమనుష్యలోకము పుత్రులవలననే" (బృ. 1-15-16) అను నీ మొదలగు లోకత్రయమునకును మార్గము నగఁబఱచు శ్రుతిచేతనే యని తెలియునది. ఆత్మలోకమును గోరునట్టి జ్ఞానికి దేవాదిలోకఋణప్రతిబంధకము లేకపోవుట యనునది "పుత్రు



వలనఁ గలుగునది యేమి?" (బృ. 4-6-22) అను నీ మొదలగు శ్రుతులచే నిరాకరింపఁబడినది. అట్లే కావషేయులనెడి మహాజ్ఞానులు దానినే (ఇట్లే) చెప్పుచున్నారు. «ఆ పరమాత్మవస్తువు నెఱింగిన జ్ఞానులు అగ్నిహోత్రమును చేయలేదు» (కౌషీ. 2-5) అని కౌషీతకిశ్రుతియందుఁ జెప్పఁబడియున్నది.

మూ. అవిదుషః తర్హి ఋణానపాకరణే పారివ్రాజ్యానుపపత్తిః ఇతిచేత్.

సన్న్యాసము బంధరహితుఁడై సంసారమునుండితప్పించుకొనుట కిచ్ఛగలవారికే గాని యితరులకుఁ గాదు.

తా. (ఆక్షేపము) అప్పుడు అజ్ఞాని ఋణమును దీర్పక గాని సన్న్యసింపఁ దగదు అనఁగా—

మూ. న, ప్రాక్ గార్హస్థ్యప్రతిపత్తేః ఋణిత్వాసంభవాత్, అధికారానురూఢో ఽపి ఋణీ చేత్ స్యాత్, సర్వస్య ఋణిత్వం ఇతి అనిష్టం ప్రసజ్యేత, ప్రతిపన్నగార్హస్థ్యస్యాపి «గృహాత్ వనీభూత్వా ప్రవ్రజేత్ యదివా ఇతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ గృహాత్ వా వనాత్ వా» ఇతి ఆత్మదర్శనోపాయ సాధనత్వేన ఇష్యత ఏవ పారివ్రాజ్యమ్, యావజ్జీవాది శ్రుతీనామ్ అవిద్వద ముముక్షువిషయే కృతార్థతా, ఛాన్దోగ్యే చ కేషాఞ్చిత్ ద్వాదశరాత్రమ్ అగ్నిహోత్రం హుత్వా తతః ఊర్ధ్వం పరిత్యాగః శ్రూయతే

తా. (సమాధానము) అట్లు కాదు. గృహస్థాశ్రమధర్మము నవలంబించుటకు పూర్వమే ఋణస్థుఁడనుట యుక్తము కాదు. గృహస్థాశ్రమము నొందనివాఁడును, దేవాదిఋణత్రయము కలవాఁ డగునేని అందఱును ఋణస్థులగుట సంభవించును. ఇది అనిష్ట మగును. గృహస్థాశ్రమస్థులకును ఇతరాశ్రమస్థులకును "గృహస్థధర్మము నుండి వానప్రస్థాశ్రమమును బడసి పిదప సన్న్యసింపవచ్చును. అనఁగా బ్రహ్మచర్యమునుండి గాని, లేక, గృహస్థుఁడుగ నుండి గాని సన్న్యసింపవచ్చును. లేక, వానప్రస్థాశ్రమమునుండియైనను సన్న్యసింపవచ్చును" (జా. 4) అని ఆత్మదర్శన మార్గమునకు సహాయముగ గ్రహింపఁదగియున్నది. "జీవితపర్యంతము"

అను నీ మొదలగు శ్రుతులు సంసారబంధమునుండి విముక్తినొందుటకు కోరిక లేని అజ్ఞానులవిషయమునం దుపయుక్తమగుచున్నది. పన్రెండుదినములు అగ్నిహోత్రము కావించి, యామీఁద త్యజింపవచ్చు నని ఛాందోగ్యోపనిషత్తునందు కొందఱికొఱకు చెప్పఁబడియున్నది.

మూ. యత్తు అనగ్నికృతానాం పారివ్రాజ్యం ఇతి తత్ న, తేషాం పృథ గేవ "ఉత్సన్నాగ్నిః అనగ్నికో వా" ఇత్యాదిశ్రవణాత్ సర్వస్మృతిషు చ అవిశేషేణ ఆశ్రమవికల్పః ప్రసిద్ధః సముచ్చయః చ.

తా. ఇఁక కర్మాధికారములేనివారికి సన్న్యాసము తగదు. అనుట సరికాదు. శ్రుతియందు "నష్టమైన అగ్నికలవారికిని, అగ్నిపరిత్యాగము చేసినవారికిని" (జా. 4) అను నీ మొదలగు శ్రుతులచేత ప్రత్యేకముగాఁ



చెప్పఁబడియున్నది. మఱియు ఏదేని యొక ఆశ్రమమును గ్రహించుటయును, క్రమమైన సన్న్యాసమును, (క్రమముగా బ్రహ్మచర్యాద్యాశ్రమముల నవలంబించుటయును) గుఱించి సకల స్మృతులయందును ప్రసిద్ధముగాఁ జెప్పఁబడియున్నది.

మూ. యత్తు "విదుషః అర్థప్రాప్తం వ్యుత్థానమ్ ఇతి అశాస్త్రార్థత్వే, గృహే వనే వా తిష్ఠతో న విశేషః" ఇతి, తత్, అసత్, వ్యుత్థానస్య ఏవ అర్థప్రాప్తత్వాత్, న అన్యత్ర అవస్థానం స్యాత్, అన్యత్ర అవస్థానస్య కామకర్మప్రయుక్తత్వం హి అవోచామ, తదభావమాత్రమ్ వ్యుత్థానం ఇతి చ.

జ్ఞాని తనయిచ్ఛచొప్పున వర్తింపఁదగదు.—

తా. ఇఁక "జ్ఞానికి సన్న్యాసము స్వయముగాసిద్ధించును," అని శాస్త్రనియమము లేకయే గృహమందును, లేక అరణ్యమునందును వసించుట వలన జ్ఞానికి (సన్న్యాసి) విశేష మేమియును లేదనుట సరికాదు. ఏలన, జ్ఞానమాత్రముచేతనే సన్న్యాసము స్వయముగా సిద్ధించుటం బట్టి వేఱొక ఆశ్రమమునందుండుట సన్న్యాసము కాదు. ఇతరాశ్రమములం దుండుట యనునది కామముచేతను కర్మముచేతను కలుగుచున్న దని యిదివఱకే చెప్పియున్నారము కదా. కావున, కామమును కర్మమును లేనిదే సన్న్యాసమనఁబడును (అనియుఁ జెప్పియున్నారము.)

మూ. యథా కామిత్వం తు విదుషః అత్యన్తమ్ అప్రాప్తమ్, అత్యన్తమూఢవిషయత్వేన అవగమాత్, తథా శాస్త్రచో

దిత మపి కర్మ ఆత్మవిదః అప్రాప్తం గురుభారతయా అవగమ్య తే కిముత అత్యన్తావివేకినిమిత్తం యథా కామిత్వమ్, నహి ఉన్మాద తిమిరదృష్ట్యుపలబ్ధం వస్తు తదపగమో ఽపి తథా ఏవ స్యాత్, ఉన్మాదతిమిర దృష్టినిమిత్తత్వా దేవ తస్య, తస్మాత్ ఆత్మవిదః వ్యుత్థానవ్యతిరేకేణ న యథా కామిత్వమ్, న చ అన్యత్ చ కర్తవ్యమ్ ఇతి ఏతత్ సిద్ధమ్.

తా. ఇక జ్ఞాని స్వేచ్ఛగావర్తించుట యెంతమాత్రమును తగదు. అట్టి పద్ధతి కేవలము మూఢపద్ధతియే యగును. ఆప్రకారమే శాస్త్రవిహితకర్మమును ఆత్మజ్ఞానికి మహాభారమైయుండును కావున,జ్ఞానికి స్వేచ్ఛాప్రవర్తనము తగదు. అని చెప్పియుండఁగా అవివేకముచేఁగల్గిన మహామూఢత్వమైన స్వేచ్ఛాప్రవర్తనమెంతయుఁ దగదుకదా ? పిత్తోద్రేకముతోను, రోగముతోను నుండు మనుష్యునిదృష్టికి గోచరమగువస్తువు వేఱువిధముగాఁ గానంబడినప్పటికిని, అదోషము పోయినమీఁద నిజమగువస్తువే కనఁబడును కదా. (పిత్తోద్రేకముచేఁ గనంబడునది ఆకాశనగరము మొదలగునవి. రోగదృష్టిచేఁ గనఁబడునవి రెండు చంద్రబింబములు మొదలగునవి. అనం) కావున, ఆత్మజ్ఞానికి సన్న్యాసముతప్ప వేఱేదియు లేదు. కనుక, వాఁడు స్వేచ్ఛగావర్తింపఁడు. వేఱే ఏ కర్మయు చేయుటయును లేదు. అని సిద్ధించెను.

మూ. యత్తు విద్యాంచ “అవిద్యాం చ యస్తద్వేద ఉభయం సహ” ఇతి—న విద్యావతః విద్యయాసహ అవిద్యా అపి



వర్తతే ఇతి అయమ్ అర్థః, కః తర్హి ?—ఏకస్మిన్ పురుషే. ఏకదేవన సహ సంబధ్యేయాతామ్ ఇత్యర్థః, యథా శుక్తికాయాం రజత శుక్తికాజ్ఞానే ఏకస్య పురుషస్య “దూరమేతే విపరీతే విషూచీ అవిద్యాయాచ విద్యేతి జ్ఞాతా” ఇతి హి కాఠకే, తస్మాత్ న విద్యాయాం సత్యామ్ అవిద్యాసంభవః అస్తి “తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ” ఇత్యాది శ్రుతేః తప ఆది విద్యోత్పత్తి సాధనం, గురూపాసనాని చ కర్మ, అవిద్యాత్మకత్వాత్ అవిద్యా ఉచ్యతే, తేన విద్యాం ఉత్పాద్య మృత్యుం కామమ్ అతితరతి ; తతః నిష్కామః త్యక్తైషణః బ్రహ్మవిద్యయా అమృతత్వం అశ్నుతే, ఇతి ఏతమ్ అర్థం దర్శయన్ ఆహ. “అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా ఽమృతమశ్నుతే” ఇతి.

కర్మరహితమైన కేవలాత్మజ్ఞానస్వరూపమును మాత్రమే యీయుపనిషత్తు బోధించుచున్నది :—

తా. ఇక “ఎవఁడు విద్యను అవిద్యను చక్కఁగాఁ దెలియుచున్నాఁడో” (ఈశ. 11) అనుటవలన, “జ్ఞానికి విద్యతోఁగూడ అవిద్యయు నున్నది” అనుట అర్థముకాదు. ఏలన, “(ఆరెండును) ఒకనియందు ఒకకాలమునందు నుండుట సంభవింపదు” అనుటయే సరియైనఅర్థము.

ఒక్కమనుష్యునకే భ్రమచే శుక్తియందు రజతమును, భ్రమ నివృత్తియైనప్పుడు శుక్తియనెడి జ్ఞానమును కలుగునట్లు “ఏది అవిద్యగాఁ గనఁ

బడినదో, ఏది విద్యగాఁ గనఁబడినదో ఆరెండును ప్రత్యేకప్రత్యేకమైనది" (కఠ-2-4) అని కఠోపనిషత్తునందు చెప్పఁబడియున్నది. కావున, విద్యకు అవిద్యతో సంబంధములేదు. "తపస్సుచే బ్రహ్మమును దెలిసికొందువుగాక" (తై 3-2-1) అను నీ మొదలగువానిని శ్రుతి చెప్పుటవలన, తపస్సు మొదలగు జ్ఞానోదయమునకు సాధనమైయున్నది. అట్లే గురువును వెదకుట మొదలగు కర్మలును జ్ఞానసాధనములై యున్నవి. అవి అవిద్యాస్వరూపముగాఁ గనం బడుచున్నదే గాని అవిద్యకాదు. తపస్సు, గురుశుశ్రూష అను నీ మొద లగువానివలన జ్ఞానమును సంపాదించికొని మృత్యువగు కామమునుండి తరిం చుచున్నాఁడు. అనంతరము కామమును, దారపుత్రాదులయందలి యాశను

వదలినవాఁడై బ్రహ్మజ్ఞానమునొంది ముక్తినిఁ బొందుచున్నాఁడు. అనియును, "అవిద్యచేత తపస్సు, గురుశుశ్రూష మొదలగు సాధనములద్వారముగా మృత్యువును తరించి, విద్యచేత ముక్తినిఁ బొందుచున్నాఁడు" (ఈశ. 11) అనియును ఈశావాస్యోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది.

మూ. యత్తు "పురుషాయుః సర్వం కర్మణైవ వ్యాప్తం కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" ఇతి, అవిద్వద్విషయత్వేన పరిహృతమ్, ఇతరథా అసంభవాత్.

తా. ఇఁక, "ఇచ్చట కర్మముల నాచరించువాఁడే శతాయువును గోరవలసినది" (ఈశ. 2) నూఱుసంవత్సరములు కర్మము చేయవలయు నను నది అజ్ఞాని నిమిత్తము గాన పరిహరింపఁ దగినది. ఏవిధముగను అవిద్య విద్యతో సంబంధింపదు.



మూ. యత్తు వక్ష్యమాణమపి పూర్వోక్త తుల్యత్వాత్ కర్మణా అవిరుద్ధమ్ ఆత్మజ్ఞానమ్ ఇతి తత్ సవిశేష నిర్విశేషాత్మతయా ప్రత్యుక్తమ్, ఉత్తరత్ర వ్యాఖ్యానే చ దర్శయిష్యామః.

తా. ఇదివఱకుఁ జెప్పఁబడిన జ్ఞానము సగుణబ్రహ్మమునుగూర్చి చెప్పఁబడినది. ఇఁకఁ జెప్పఁబోవుజ్ఞానము నిర్గుణబ్రహ్మమునుగూర్చి చెప్పఁ బడును. (అనుటయే ముఖ్యతాత్పర్యము.)

మూ. అతః కేవల నిష్క్రియ బ్రహ్మాత్మైకత్వ విద్యా ప్రదర్శనార్థమ్ ఉత్తరో గ్రన్థః ఆరభ్యతే.

తా. కాఁబట్టి, ఇఁక చెప్పఁబోవుగ్రంథము కేవలము క్రియారహితమైయుండు బ్రహ్మాత్మైకత్వజ్ఞానమును (బ్రహ్మమును ఆత్మయు నొక్కటే యనుటను) చక్కఁగా బోధించునిమిత్తమై ప్రారంభింపఁబడుచున్నది.

ఐతరేయోపనిషత్తు ఉపోద్ఘాతము
సమాప్తము.



## అథ పూర్వశాన్తిః.

ఓమ్ వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనో మే వాచి ప్రతిష్ఠిత మావిరావీర్మ ఏధి వేదస్య మ ఆణీస్థః శ్రుతం మే మా ప్రహాసీ

రనే నాధీ తేనా హోరాత్రాన్ త్సం దధామ్యృతం వదిష్యామి సత్యం వదిష్యామి! తన్మా మవతు తద్వక్తార మవ త్వవతు మా మవతు! వక్తార మవతు వక్తారమ్.

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః.

---



హరిః ఓమ్.

ఋగ్వేదీయ

# ఐతరేయోపనిషత్తు

## ప్రథమోఽధ్యాయః.

---

### అథ ప్రథమః ఖణ్డః.

మూ. హరిః ఓమ్. ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్, నా న్యత్కిఞ్చన మిషత్ స ఈక్షత లోకాన్నుసృజా ఇతి. 1



టీ. ఇదం = ఇది (ఈప్రపంచము), అగ్రే = పూర్వము (సృష్టికి పూర్వము), ఆత్మా వై = ఆత్మగానే, ఏకః ఏవ = ఒక్కటిగానే, ఆసీత్ = ఉండెను. అన్యత్ = ఇతరమైనది, కించన = ఏదియు, మిషత్ = ఏవ్యాపారమును, న = లేదు. సః = వాఁడు (ఆ ఆత్మ), లోకాన్ = లోకములను, సృజేను = సృష్టించెదను గాక, ఇతి = అని, ఈక్షత = చూచెను (ఆలోచించెను.)

తా. ఈప్రపంచము సృష్టికిపూర్వము పరమాత్మ అద్వితీయుఁడై, సర్వజ్ఞుఁడై, సర్వశక్తికలవాఁడై, క్షుత్పిపాసాది సకల సంసారధర్మములు లేనివాఁడై, నిత్యుఁడై, పరిశుద్ధుఁడై, బుద్ధుఁడై, ముక్తుఁడై, జన్మము లేనివాఁడై, వార్ధక్యములేనివాఁడై, మరణములేనివాఁడై, మృతిలేనివాఁడై, కేవలాత్మమాత్రుఁడై యుండెను. అనఁగా నామరూప వ్యాపారములతోఁ గూడిన జగత్సృష్టికి మునుపు ఆత్మ యొక్కటిమాత్రమే యుండెను. ఇట్టి నామరూపవ్యాపారరహితుఁడైన ఆత్మ ప్రాణులయొక్క కర్మఫలములకు ఉపభోగస్థానము లగు ద్యులోకము మొదలగు లోకములను సృష్టించవలయు నని తలంచెను. అనఁగా, ఫేన బుద్బుదతరంగాదు లెట్లు నామరూపములను బొంది నీటికంటె వేఱుగాఁ దోఁచినప్పటికిని మరల అవి నీరుమాత్రమే యై యుండునట్లు ప్రపంచమునందలి సకలనామరూపములను బొందిన సకల వస్తువులును పరమాత్మకంటె భిన్నముకాదు.

మూ. స ఇమాం ల్లోకా నసృజత, అమ్భో మరీచీ ర్మరమాపో
ఽదో ఽమ్భః పరేణ దివం ద్యౌః ప్రతిష్ఠా ఽన్తరిక్షం మరీ
చయః, పృథివీమరోయా అధస్తాత్తా ఆపః. 2

టీ. సః = ఆపరమాత్మ, ఇమాన్ = ఈ, లోకాన్ = లోకములను, అసృజత = సృజించెను. (తే = అవి), అమ్భః= అంభస్సు, మరీచిః= మరీచి (కిరణము), మరం = మరము, ఆపః = జలము, (ఇతి= అని), (ఉచ్యన్తే = చెప్పఁబడుచున్నవి), అదః = ఆ, అమ్భః=అంభస్సనులోకము, దివం పరేణ = ద్యులోకమునకు ఆవల, (అస్తి = ఉన్నది.) (తస్య= దానికి), ద్యౌః = ద్యులోకము, ప్రతిష్ఠా = ఆధారముగా, (భవతి = ఉన్నది.) మరీచయః = కిరణములు, అన్తరిక్షం =అంతరిక్షముగా, (భవన్తి=ఉన్నవి.) మరః = మరము (మర్త్యలోకము), పృథివీ = భూమిగా, భవతి= ఉన్నది. యాః=ఎవి, అధస్తాత్ = క్రిందుగాఁ భూమికంటెక్రిందుగా(సన్తి=కలవో) తాః=అవి, ఆపః=అప్పులుగా, ఉచ్యన్తే= చెప్పఁబడుచున్నవి.

తా. ఆయాత్మయే ఈలోకములను సృష్టించెను. బుద్ధిమంతులగు వడ్లవాండ్రు మొదలగువారు మిద్దెలు మేడలు మొదలగువాని నెట్లు మనస్సులో నాలోచించి కట్టెదరో అట్లు ప్రపంచమును సృష్టించెను. ఉదకము తనయందుండియే ఫేనబుద్బుదతరంగములను నిర్మించికొనినట్లు పరమాత్మయు ఉపాదానకారణమై సకలప్రపంచమును సృజించెను. (ఇచ్చట పరమాత్మ వడ్రంగి, ఉదకము, ఇవి తమతమవృత్తులకు ఉపాదానకారణముగ నున్నది. ఉపాదానము అనఁగా ప్రథమకారణము. అనఁగా ఘటమునకు మృత్తిక వంటిది.) మఱియు, ఇంద్రజాలికుఁడు తన్నే ఆకాశమున నడుచువానినిఁగా నిర్మించికొనినట్లు సర్వశక్తియుక్తుఁడగుపరమాత్మ ప్రపంచమునుసృజించెను. పరమాత్మ ఏయేలోకములను సృష్టించినాఁడు? అంభస్సు మొదలగులోకములనుసృజించినాఁడని శ్రుతియందే చెప్పఁబడియున్నది. అంభస్సనెడి లోక



ము ద్యులోకమున కావలనున్నది. ఇది వర్షమును (జలమును) ధరించుటచే దీని కీపేరుగల్గెను. ఈఅంభస్సనులోకమునకు ద్యులోకము ఆధారముగనున్నది. ద్యులోకమునకు దిగువనుండునది. అంతరిక్షలోకము. ఇచ్చట సూర్యకిరణములుండుటంబట్టి దీనికి మరీచిలోకమని చెప్పఁబడియె. ఎచ్చట సకలభూతములును మరణమునొందుచున్నదో ఆలోకము మరమనఁబడెడిభూలోకము. భూలోకమునకు దిగువ అప్పులు కలవు. లోకములన్నియు పంచభూతాత్మకములైనప్పటికిని అప్పులు విశేషము లగుటంజేసి సకలలోకములు అప్ఛబ్దవాచ్యములైనవి. ఈవిధముగా ఆపరమాత్మ ప్రాణులెల్లరును కర్మఫలముల ననుభవించుటకొఱకు అంభస్సు, మరీచి, మరము, అప్పు, అనునాలుగు లోకములను క్రమముగా నొకదానిక్రింద నొకటిని సృజియించెను.

మూ. స ఈక్షతే మేనులోకాలోకపాలాన్నుసృజా ఇతి, సోద్భ్య ఏవ పురుషం సముద్ధృత్యామూర్ఛయత్, 3

టీ. సః=ఆపరమాత్మ, ఇమే=ఈ, లోకాః=(నాచే సృజింపఁబడిన) లోకములు, (భవన్తి)'ను=కలవు.) లోకపాలాన్ =లోకపాలకులను, సృజా ఇతి=సృజించెదనని, ఈక్షత=ఆలోచించెను. సః = ఆపరమాత్మ, అద్భ్యః ఏవ=అప్పులనుండియే, పురుషం=పురుషుని, సముద్ధృత్య=ఎత్తి, అమూర్ఛయత్=నిర్మించెను.

తా. ఆపరమాత్మ "నాచే సృజింపఁబడినలోకములను పాలించువారు లేనిచో నాశమగును" అని యాలోచించి, కుమ్మరి కుండలుచేయుటకు భూమియందుండి మంటిని ముద్దచేసి యెత్తునట్లు, జలమునందుండియే పురుషుని శిరఃపాణ్యాద్యవయవములతోఁ గూడినవానినిగా నెత్తెను. అనఁగా ఉదక

ములే ప్రధానముగాఁ గల ఏపంచభూతములనుండి అంభస్సు మొదలగులోకములను సృజించెనో, వానినుండియే పురుషుని నిర్మించెను.

మూ. తమభ్యతపత్తస్యాభితప్తస్య ముఖం నిరభిద్యత యథాణ్డం, ముఖాద్వాగ్వాచోఽగ్నిర్నాసికే నిరభిద్యేతాం నాసికాభ్యాం ప్రాణః ప్రాణాద్వాయు రక్షిణీనిరభిద్యేతాం అక్షిభ్యాం చక్షుశ్చక్షుష ఆదిత్యః కర్ణౌ నిరభిద్యేతాం కర్ణాభ్యాం శ్రోత్రం శ్రోత్రాద్దిశస్త్వ జ్నిరభిద్యత త్వచో లోమాని లోమభ్య ఓషధివనస్పతయో హృదయం నిరభిద్యత హృదయాన్మనో మనసశ్చన్ద్రమా నాభిర్నిరభిద్యత నాభ్యా అపానో ఽపానాన్మృత్యుః శిశ్నం నిరభిద్యత శిశ్నాద్రేతో రేతస ఆపః. 4

ఇతి ప్రథమః ఖణ్డః.

టీ. (సః=ఆపరమాత్మ), తం=పురుషరూపమగు ఆపిండమును (ఉద్దేశించి) అభ్యతపత్ = తపించెను (ఆలోచించెను). తస్య = ఆపిండమునకు, ముఖం=ముఖము (నోరు), అణ్డంయథా = పక్షిగ్రుడ్డువలె, నిరభిద్యత = చీలెను. (కలిగెను), ముఖాత్ = (ఆ)ముఖమునుండి, వాక్=వాక్కు (కలిగెను); వాచః=వాక్కునుండి, అగ్నిః=అగ్ని(కలిగెను,) నాసికే=ముక్కులు, నిరభిద్యేతాం=కలిగినవి, నాసికాభ్యాం = ముక్కులయందుండి, ప్రాణః=



ప్రాణములు (కలిగెను), ప్రాణాత్=ప్రాణములనుండి, వాయుః=వాయువు (కలిగెను), అక్షిణీ = నేత్రములు, నిరభిద్యేతాం = కలిగెను. అక్షిభ్యాం= నేత్రములయందుండి, చక్షుః=ప్రకాశము (కలిగెను). చక్షుషః=ప్రకాశమునుండి, ఆదిత్యః=సూర్యుఁడు కలిగెను). కర్ణౌ=చెవులు, నిరభిద్యేతాం= కలిగెను. కర్ణాభ్యాం = చెవులయందుండి, శ్రోత్రం=శబ్దము (కలిగెను), శ్రోత్రాత్=శబ్దమునుండి, దిశః = దిక్కులు (కలిగెను). త్వక్ = చర్మము, నిరభిద్యత=కలిగెను. త్వచః=చర్మమునుండి, లోమాని=వెండ్రుకలు (కలిగెను), లోమేభ్యః=వెండ్రుకలనుండి, ఓషధివనస్పతయః = చిన్నచెట్లును మ్రానులును (కలిగెను), హృదయం = హృదయము, నిరభిద్యత=కలిగెను. హృదయాత్=హృదయమునుండి, మనః=మనస్సు(కలిగెను.) మనసః=మనస్సునుండి, చంద్రమాః = చంద్రుఁడు (కలిగెను), నాభిః = నాభి, నిరభిద్యత=కలిగెను, నాభ్యాః = నాభినుండి, అపానః=అపానము(కలిగెను), అపానాత్=అపానవాయువునుండి, మృత్యుః = మృత్యుదేవత (కలిగెను), శిశ్నం=శిశ్నము, నిరభిద్యత్=కలిగెను. శిశ్నాత్=శిశ్నమునుండి, రేతః= రేతస్సు (కలిగెను.) రేతసః=రేతస్సునుండి, ఆపః=జలములు, (కలిగెను.)

తా. ఆపరమాత్మ పురుషాకృతి యగుపిండమును గూర్చి ఆలోచించెను. (ఇచ్చట తపించుట యనఁగా పరితపించుట, లేక ఆలోచించుట యనియర్థమే గాని చాంద్రాయణాది తపస్సుగాదు. ముం. 1-1-9.) అంత పురుషాకృతియగు ఆపిండమునకు నోరు (వాక్కు) కలిగెను. ఆవాక్కునుండి వాగింద్రియము కలిగెను. వాగింద్రియమునుండి దానికధిష్ఠానదేవత యగు

అగ్ని కలిగెను. పిమ్మట ముక్కులు కలిగెను. ముక్కులనుండి ఘ్రాణేంద్రియము (ప్రాణము) కలిగెను. ఘ్రాణేంద్రియమునుండి దాని కధిష్ఠానదేవతయగువాయువు కలిగెను. తర్వాత నేత్రములు కలిగెను. నేత్రములనుండి నేత్రేంద్రియము కలిగెను. నేత్రేంద్రియము నుండి దాని కధిష్ఠానదేవతయగు సూర్యుఁడు కలిగెను. పిమ్మట శ్రోత్రములు కలిగెను. ఆశ్రోత్రములనుండి శ్రోత్రేంద్రియము కలిగెను. శ్రోత్రేంద్రియము నుండి దానికధిష్ఠానదేవతలగుదిక్కులు కలిగెను. అనంతరము చర్మము కలిగెను. చర్మమునుండి రోమములు కలిగెను. రోమములనుండి నాని కధిష్ఠానములగు తరుగుల్మలతాదులు కలిగెను. తరువాత అంతఃకరణాధిష్ఠానమగుహృదయము కలిగెను.

హృదయమునుండి మనస్సు కలిగెను. మనస్సునుండి దానికధిష్ఠానమగుచంద్రుఁడు కలిగెను. పదంపడి సకలవాయుబంధనస్థానమైన నాభి కలిగెను. నాభినుండి అపానవాయువుతోఁ గూడిన పాయ్వింద్రియము కలిగెను. పాయ్వింద్రియమునుండి దాని కధిష్ఠానమగుమృత్యువుకలిగెను. ఆమీఁద శిశ్నము కలిగెను. ఆశిశ్నమునుండి శుక్లము కలిగెను. ఆశుక్లమునుండి దాని కధిష్ఠానము లగుజలము కలిగెను. ఇట్లు పరమాత్మ, పురుషాకృతి పిండమునకు వాక్కు మొదలగునవియును, వానికి ఇంద్రియములను, ఆయింద్రియములకు అధిదేవతలను సృజించెను.

ఇట్లు ప్రథమఖండము సమాప్తము.

---

# ఐతరేయోపనిషత్తు.

---

అథ ద్వితీయఖణ్డః.

మూ. తా ఏతా దేవతాః సృష్టా అస్మి న్మహత్యర్ణవే ప్రాపతన్,
త మశనాయా పిపాసాభ్యా మన్వవార్జత్ తా ఏన మబ్రువ
న్నాయతనం నః ప్రజానీహి యస్మిన్ ప్రతిష్ఠితా అన్నమదా
మేతి. 1

టీ. సృష్టాః=సృజింపఁబడిన, తాః=ఆ (ప్రసిద్ధములైన) ఏతాః=ఈ, దేవతాః=అగ్న్యాదిదేవతలు, అస్మిన్=ఈ, మహతి = గొప్పదైన, అర్ణవే=సముద్రమునందు, ప్రాపతన్=పడినవారైరి. (సః=ఆపరమాత్మ), తం=(ఆపిండాకృతియైన) వానిని అశనాపిపాసాభ్యాం=ఆఁకలిదప్పులతో, అన్వవార్జత్=(అనుసరించునట్లు) కూర్చెను. (వయం=మేము) యస్మిన్=ఏస్థానమునందు, ప్రతిష్ఠితాః=నెలకొన్నవారమై, అన్నం=ఆహారమును, అదామ=భుజింపనగునో, (తత్=అట్టి), ఆయతనం=స్థానమును, నః=మాకు ప్రజానీహి=కలుగఁజేయుము. ఇతి=అని, తాః = వారు, ఏనం = ఆపరమాత్మను (జూచి), అబ్రువన్=పలికిరి.

తా. ఆఈశ్వరునిచే (పరమాత్మచే) లోకపాలనముకొఱకు సృజింపఁబడిన అగ్న్యాదిదేవతలు, అజ్ఞానము, కామము, కర్మము, జన్మము, దుఃఖము,

అనునివియే జలముగాఁ గలదియును; శరీరము లగురోగములు, జరామరణములు, ఇవియే మొసళ్లుగాఁ గలదియును, ఆద్యంతములు లేనిదియును,అపారమైనదియును, ఆధారము లేనిదియును, విషయేంద్రియములవలనఁ గలిగిన సుఖలేశముచే క్షణకాలము విశ్రాంతికలదియును, జ్ఞానేంద్రియపంచకము యొక్క విషయాభిలాషమనెడి వాయుచలనముచేఁ గల్గిన అనేకానర్థములగు మహాతరంగములు గలదియును, మహాఘోరనరకానుభవముచే హాహాకారముల వలనఁ గల్గిన మహాధ్వని కలదియును, సత్యము, ఆర్జవము, దానము, దయ, అహింస, దమము, శమము, ధృతి అను నీమొదలగు ఆత్మగుణములైన పాథేయము (మార్గమందలి భోజనము) చే నిండింపఁబడిన జ్ఞాన మను

నౌక (తెప్ప) కలదియును, సజ్జనసహవాసము, సర్వసంగపరిత్యాగము అనునివియే మార్గముగాఁ గలదియును, మోక్షమే తీరముగాఁ గలదియును, అగు ఈసంసార మనెడిమహాసముద్రములోఁ బడిరి. అనంతరము అపరమాత్మ పురుషాకృతిపిండమునకు ఆఁకలి దప్పులను కలుగఁజేసెను. ఇట్లొనర్చినందున ఆపిండమునుండి పుట్టిన అగ్న్యాదిదేవతలందఱును ఆఁకలిదప్పులచేఁ బీడింపఁబడినవారై తమ్ము సృష్టించిన పరమాత్మను గూర్చి "మేము ఏయధిష్ఠానమును బొంది ఆఁకలిదప్పులను నివర్తిచేసికొననగునో, అట్టి అధిష్ఠానమును మాకుఁ గలుగఁజేయుము" అని ప్రార్థించిరి.

మూ. తాభ్యో గా మానయత్తా అబ్రువ న్నవై నోఽయమల
ం. తాభ్యోఽశ్వ మానయత్తా అబ్రువ న్నవై నోఽయ 2
లమితి.



మూ° టీ. (సః=అయీశ్వరుఁడు), తాభ్యః=ఆదేవతలకొఱకు, గాం=గోవును, అనయత్ =(పూర్వమువలెనే ఆజలములనుండి యెత్తి) కనఁబఱచెను. తాః=వారు (ఆదేవతలు), అయం=ఇది (ఈగోవు) న అలం వై=మాకుచాలినదికాదు. ఇతి=అని, అబ్రువన్=చెప్పిరి. (అనన్తరం=మరల) (సః=ఆయీశ్వరుఁడు), తాభ్యః=ఆదేవతలకొఱకు, అశ్వం=గుఱ్ఱమును, అనయత్=(పూర్వమువలెనే) అగపఱచెను. తాః=ఆదేవతలు,అయం=ఇది,నః=మాకు, న అలంవై=చాలినదికాదు. ఇతి=అని, అబ్రువన్=పలికిరి.

తా. ఇట్లు అడిగినదేవతలకొఱకు అయీశ్వరుఁడు పూర్వమువలెఁ జలదకములలో నుండియే యొకపిండము నెత్తి గోవుగా నిర్మించి దేవతల కగపఱచెను. "ఇది మాకు సమర్థమైనది కా"దనిరి. పిమ్మట ఆయీశ్వరుఁడు పూర్వమువలెనే గుఱ్ఱమును నిర్మించి యాదేవతల కగపఱచెను. అప్పుడు వారు "ఇదియును మాకు సమర్థమైనది కాదు" అనిరి.

మూ. తాభ్యః పురుష మానయత్తా అబ్రువన్ సుకృతం బతే
తి పురుషో వావ సుకృతమ్, తా అబ్రవీ ద్యథాయతనం ప్ర
విశతేతి. 3

టీ. (సః=అయీశ్వరుఁడు), తాభ్యః=దేవతలకొఱకు, పురుషం=పురుషాకృతిని (మనుష్యాకారమును), అనయత్=అగపఱచెను. తాః=ఆదేవతలు బత=హా! (బళీ) సుకృతం=సుకృతము. (శుభమే) ఇతి=అని, అబ్రువన్=పః వావ=పురుషుఁడే కదా సుకృతం=సుకృతము (అనియీశ్వరుఁడు ఆదేవ చెప్పిరి. పురుతలనుజూచి) యథాఽఽయతనం=తగినస్థానమును, ప్రవిశతేతి=ప్రవేశింపుఁడని, తాః=ఆదేవతలకు, అబ్రవీత్=చెప్పెను.

**తా.** పిమ్మట, ఆయీశ్వరుఁడు పూర్వమువలెనే ఆయుదకములయందుండి మనుష్యాకృతియగు పిండమును అగపఱచగా, దేవతలు జూచి సంతసించి, "ఇది సుకృతమైనది, మంచిదే" అనఁగా, ఈశ్వరుఁడు, "ఓ దేవతలారా! ఈశరీరము మీవాగాదివ్యాపారములకుఁ దగిన స్థానమై యున్నది; కావున, ప్రవేశింపుఁడు" అనెను. (ఈ మనుష్యాకారము పరమాత్మచేతనే సృజింపఁబడినందువలనను, మంచికార్యము అను నర్థమిచ్చు నట్టిదిగానుండుటవలనను, సకలపుణ్యకర్మములకెల్ల కారణమై యుండుటవలనను సుకృతమని చెప్పఁబడినది).

**మూ.** అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశ ద్వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశ దాదిత్య శ్చక్షు ర్భూత్వాఽక్షిణీ ప్రావిశ ద్దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశ న్నోషధివనస్పతయో లోమాని భూత్వా త్వచం ప్రావిశం శ్చన్ద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశత్ మృత్యు రపానో భూత్వా నాభిం ప్రావిశ దాపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్. 4

**టీ.** అగ్నిః=అగ్ని, వాక్ భూత్వా=వాక్కు అయి, ముఖం=నోటిని, ప్రావిశత్=ప్రవేశించెను. వాయుః=వాయువు, ప్రాణః భూత్వా=ప్రాణవాయువై, నాసికే=ముక్కురంధ్రములను ప్రావిశత్=ప్రవేశించెను. ఆదిత్యః=సూర్యుఁడు, చక్షుః భూత్వా=నేత్రేంద్రియమై (తేజస్సై) అక్షిణీ=నేత్రములను, ప్రావిశత్=ప్రవేశించెను. దిశః = దిక్కులు, శ్రోత్రంభూత్వా = శ్రోత్రేంద్రియమై, కర్ణౌ=చెవులను, ప్రావిశన్ = ప్రవేశించినవి. ఓషధివనస్పతయః = పుష్పించికాచు నట్టివియును, పుష్పించక కాచునట్టివియు వగు



వృక్షములును, లోమానిభూత్వా = శరీరమందలిరోమములై, త్వచం=త్వక్కును(చర్మమును), ప్రావిశన్=ప్రవేశించినవి. చన్ద్రమాః=చంద్రుఁడు, మనఃభూత్వా = మనస్సుఅయి, హృదయం = హృదయమును, ప్రావిశత్ = ప్రవేశించెను. మృత్యుః=మృత్యువు, అపానఃభూత్వా=అపానవాయువై, నాభిం=నాభిని, ప్రావిశత్=ప్రవేశించెను. ఆపః=జలములు, రేతఃభూత్వా=శుక్లమై, శిశ్నం=శిశ్నమును, ప్రావిశన్=ప్రవేశించినవి.

**తా.** ఇట్లు అగ్న్యాదిదేవతలు పరమాత్మ యనుజ్ఞను బొంది, రాజాజ్ఞను బొందిన సేనాధిపతులు పట్టణంబునందుఁ బ్రవేశించునట్లు, వాగభిమానదేవతయగు అగ్ని తనజన్మస్థానమైన వాక్కునందుఁ బ్రవేశించెను. ఈరీతిగానే వాయువు ప్రాణస్వరూపమై ముక్కులను, సూర్యుఁడు నేత్రేంద్రియమై కన్నులను, దిక్కులు శ్రోత్రేంద్రియమై చెవులను, వృక్షములు రోమములై చర్మమును చంద్రుఁడు మనస్సై హృదయమును, మృత్యువు అపానమై నాభిని, జలములు శుక్లమై శిశ్నమును బ్రవేశించినవి.

**మూ.** త మశనాపిపాసే అబ్రూతా మవాభ్యా మభిప్రజానీహీతి తే అబ్రవీ దేతా స్వేవ వాం దేవతా స్వాభజా మ్యేతాసు భాగిన్యౌ కరోమీ తి, తస్మా ద్యస్యై కస్యై చ దేవతాయై హవి ర్గృహ్యతే భాగిన్యా వేవాస్యా మశనాపిపాసే భవతః. 5

ఇతి ద్వితీయః ఖణ్డః.

**టీ.** తం=ఆపరమాత్మనుగూర్చి (చూచి), అశనాపిపాసే = ఆఁకలిదప్పులు, అవాభ్యాం=మాకొఱకు, (ఆయతనం=స్థానమును), అభిప్రజానీహి=

ఆలోచింపుము. ఇతి=అని, అబ్రూతాం=అడిగినవి, ఏతాసు ఏవ=ఇదుగో, దేవతాసు=దేవతలయందు, వాం=మిమ్ము, అభజామి=పొందించుచున్నాను. (ఆదరించెదను), ఏతాసు=ఈఅగ్న్యాదిదేవతలయందు, భాగిన్యౌ=భాగములనుగా(భాగస్థులనుగా), కరోమి=చేయుచున్నాను. ఇతి=అని, (సః=అపరమాత్మ), తే=ఆదేవతలను, అబ్రవీత్ = చెప్పెను, తస్మాత్ = అందువలన, యదా=ఎప్పుడు, యస్యైకస్యైచ=ఏదేనియొక, దేవతాయై=దేవతకొఱకు, హవిః = హవిస్సు, గృహ్యతే = అర్పింపఁబడుచున్నదో, (గ్రహింపఁబడుచున్నదో), (తదా=అప్పుడు), అశనాపిపాసే = ఆఁకలిదప్పులు, అస్యాం=దానియందు(ఈదేవతావిషయకమైన), భాగిన్యావేవ=భాగములే (భాగములు కలవిగా), భవతః=అగుచున్నవి.

తా. ఇట్లు అగ్న్యాదిదేవతలు స్థానమును బొందినవెంటనే, క్షుత్పిపాసలు తమకు స్థానమువలయునని ఆఈశ్వరుని జూచి యడిగెను. అంత ఈశ్వరుఁడు, "ఓక్షుత్పిపాసలారా, మీరు ఏదేనిచేతనపదార్థమును అధిష్ఠింపక గాని భుజించుటకు వలనుపడదు. కావున, మీరు అధ్యాత్మదేవతలును అధిదేవతలు నైనఅగ్న్యాదిదేవతలయందు మీకు జీవనమును విభాగించియిచ్చెదను అనెను. ఇట్లు సృష్ట్యాదియందు ఈశ్వరుఁడు విభజించినందున, ఇప్పుడును ఏదేని యొకదేవతకొఱకు చరుపురోడాశము మొదలగు హవిస్సు అర్పింపఁబడుచున్నదో, ఆయాదేవతావిషయమైన భాగములే క్షుత్పిపాసలగుచున్నవి. (అధ్యాత్మదేవతలనఁగా, వ్యష్టిదేహమందుండు దేవతలు. అధిదేవతలనఁగా, సమష్టివిరాట్టుదేహమందుండు దేవతలు. అనం)

ఇది ద్వితీయఖండము.

---

# ఐతరేయోపనిషత్తు

---

## అథ తృతీయఖండః.

మూ. స ఈక్షతేమే ను లోకాశ్చ లోకపాలాశ్చాన్నమేభ్యః సృజా ఇతి. 1

టీ. (సః=ఆఈశ్వరుఁడు), ఇమే=ఈ, లోకాః చ=లోకములును, లోకపాలాః చ=లోకపాలకులును, (భవన్తి ను= ఉన్నారు), ఏభ్యః=వీరికి, అన్నం=ఆహారమును, సృజై=నిర్మించెదనుగాక, ఇతి=అని, ఈక్షత=ఆలోచించెను.

తా. ఆయీశ్వరుఁడు, "నాచేత లోకములును లోకపాలకులును ఆఁకలిదప్పులతో సృజింపఁబడిరి. ఆ అగ్న్యాదిదేవతలకు ఆహారములేనిచో స్థితి కలుగదు. కాఁబట్టి నేను వారికొఱకు అన్నమును సృజించెద" నని ఆలోచించెను.

మూ. సోఽపోఽభ్యతపత్ తాభ్యోఽభితప్తాభ్యో మూర్తిరజాయత, యా వై సా మూర్తిరజాయతాన్నం వై తత్.

టీక. సః=ఆయీశ్వరుఁడు, అపః=జలములను అభ్యతపత్=ఆలోచించెను. (తలంచెను) అభితప్తాభ్యః=ఆలోచింపఁబడిన, తాభ్యః=ఆయుదకములనుండి, మూర్తిః=స్వరూపము, అజాయత=కలిగెను. యా వై=ఏదియో,

సా=అ, మూర్తిః=రూపముగా, అజాయత=కలిగెనో, తత్ వై=అదియే, అన్నం=అహారముగా, అభూత్=అయెను.

తా. అయీశ్వరుఁడు అన్నమును సృజింపనెంచినవాఁడై, మున్ను చెప్పఁబడిన జలములను (పంచభూతములను) ఆలోచించెను. ఇట్లాలోచింపఁబడిన ఆజలములయందుండి (ఉపాదానకారణమైన ఆయుదకములలోనుండి) మిక్కిలి కఠినము శరీరపోషణోపయోగము నైనస్థావరజంగమాత్మకమగునొకమూర్తి కలిగెను. ఇదియే అన్నమైనది. (స్థావరము—వడ్లు, గోధుమలు, జొన్నలు మొదలగుమనుష్యోపయోగమైనఆహారము. జంగమము—ఎలుకలు, పందికొక్కులు మొదలగు నవి. ఇవి పిల్లులు మొదలగువాని కుపయోగమగు నాహారము.)

మూ. తదేనత్సృష్టం పరాఙత్యజిఘాంసత్తద్వాచాఽజిఘృక్ష
త్తన్నాశక్నోద్వాచా గ్రహీతుం. సయద్ధైనద్వాచాఽగ్ర
హైష్య దభివ్యాహృత్య హైవాన్నమత్రప్స్యత్. 3

టీ. సృష్టం=సృజింపఁబడిన, తత్=అ, ఏనత్=ఇది, పరాఙ్ (సత్) =మరలిపోవునదియై, అత్యజిఘాంసత్=పోవుటకుఁగోరెను. (సః=ఆ మొదట పుట్టినవిరాట్టు) తత్=ఆయన్నమును, వాచా=వాక్కుతో, అజిఘృక్షత్=పట్టుటకు (గ్రహించుటకు) నిశ్చయించెను. తత్=ఆయన్నమును, వాచా=వాక్కుతో, గ్రహీతుం=గ్రహించుటకు, నఅశక్నోత్=సమర్థుఁడు కాఁడయ్యెను. సః=ఆవిరాట్టు, ఏనత్ హ=దీనిని (ఈ అన్నమును), వాచా=వాక్కుచేత, అగ్రహైష్యత్ యత్=గ్రహించియుండినయెడల, (సర్వాః



జన్తుః=సకలప్రాణులును) అన్నం=ఆహారమును, అభివ్యాహృత్య హ ఏవ=చెప్పియే, అత్రప్స్యత్=తృప్తినొందియుండును.

తా. ఇట్లు సృజింపఁబడిన ఆయన్నమును లోకపాలకుల కభిముఖముగా నుంపఁగా, ఆయన్నము ఆలోకపాలకులను జూచి వీరు నాకు మృత్యుస్వరూపులని తలంచి పాఱిపోవుట కుపక్రమించెను. అంత మొదటపుట్టిన విరాట్టు ఆయన్నమును వాక్కుతో గ్రహింపఁగోరెను గాని, అతనివలన గ్రహించుటకు సమర్థము కాకపోయెను. ఆవిరాట్టు అన్నమును వాక్కుతో గ్రహించియున్నయెడల, సకలప్రాణులును ఆహారమును నోటితో చెప్పియే తృప్తినిఁ బడసియుండును.

మూ. తత్ప్రాణేనాజిఘృక్షత్ తన్నాశక్నోత్ప్రాణేన గ్రహీ
తుమ్, సయద్ధైనత్ప్రాణేనాగ్రహైష్య దభిప్రాణ్యహై
వాన్నమత్రప్స్యత్. 4

టీ. సః=ఆవిరాట్టు, తత్=ఆయన్నమును, ప్రాణేన=ఘ్రాణేంద్రియముచేత (ప్రాణముచేత) అజిఘృక్షత్=గ్రహింపనెంచెను. తత్=ఆయన్నమును, ప్రాణేన=ప్రాణముచేత, గ్రహీతుం=గ్రహించుటకు, న అశక్నోత్=సమర్థముకాకపోయెను. (సః=ఆవిరాట్టు), ఏనత్ హ=దీనిని (ఈయన్నమును) ప్రాణేన=ప్రాణముచేత, అగ్రహైష్యత్ యత్=గ్రహించియుండువేని, (సర్వాః=సమస్తమైన), (జన్తుః=ప్రాణులును) అన్నం=ఆహారమును, అభిప్రాణ్య హ ఏవ=మూర్కొనియే అత్రప్స్యత్=తృప్తినొందును.

తా. అవిరాట్టు ఘ్రాణేంద్రియముచే ఆయన్నమును గ్రహించుటకుఁ బ్రయత్నించెను. అయినప్పటికిని ఆయింద్రియము సమర్థము కాకపోయెను. అవిరాట్టు అన్నమును ఘ్రాణేంద్రియముచే గ్రహించియుండినయెడల సకలప్రాణులును అన్నమును ఆఘ్రాణించియే (మూర్కొనియే) తృప్తినిఁ బొందును.

మూ. తచ్చక్షుషాఽజిఘృక్షత్, తన్నాశక్నోచ్చక్షుషా గ్ర
హీతుమ్, స యద్ధైనచ్చక్షుషాఽగ్రహైష్యద్దృష్ట్వా హై
వాన్నమత్రప్స్యత్. 5

టీ. (సః=అవిరాట్టు) తత్ = ఆయన్నమును, చక్షుషా= నేత్రముచేత, అజిఘృక్షత్ = గ్రహింపనిశ్చయించెను. తత్ = ఆయన్నమును, చక్షుషా = నేత్రముచేత, గ్రహీతుం =గ్రహించుటకు, నఅశక్నోత్ = సమర్థము కాకపోయెను. సః = అవిరాట్టు, ఏనత్ హ= ఈయన్నమును, చక్షుషా= నేత్రముచేత, అగ్రహైష్యత్ యత్ = గ్రహించియుండునేని, (సర్వాఃజన్తుః=సకలప్రాణులును, అన్నం = ఆహారమును, దృష్ట్వా హ ఏవ= చూచియే, అత్రప్స్యత్ =తృప్తినిఁబొందును.

తా. అవిరాట్టు అన్నమును నేత్రముచే గ్రహించుటకిచ్ఛయించి, గ్రహించుటకు శక్తిలేనిదయ్యెను. అవిరాట్టు అయన్నమును నేత్రముచే గ్రహించియుండినయెడల, సకలప్రాణులును ఆహారమును జూచియే తృప్తినిఁ బొందును.



మూ. తచ్ఛ్రోత్రేణాజిఘృక్షత్ తన్నాశక్నోచ్ఛ్రోత్రేణ గ్రహీ
తుమ్, సయద్ధైనచ్ఛ్రోత్రేణాగ్రహైష్యచ్ఛ్రుత్వాహైవాన్న
మత్రప్స్యత్. 6

టీ. (సః=అవిరాట్టు), తత్ = ఆయన్నమును, శ్రోత్రేణ=చెవులచే, అజిఘృక్షత్ =గ్రహింపఁగోరెను, తత్ =అయన్నమును, శ్రోత్రేణ=చెవులచే, గ్రహీతుం=గ్రహించుటకు, న అశక్నోత్ =శక్తికలదికాకపోయెను, సః= అవిరాట్టు, ఏనత్ హ= ఈయన్నమును, శ్రోత్రేణ= చెవులచేత, అగ్రహైష్యత్ యత్ =గ్రహించియుండినచో (సర్వాఃజన్తుః= సకలజీవులును), అన్నం= అన్నమును, శ్రుత్వా హ ఏవ= వినియే, అత్రప్స్యత్ =తృప్తినొందును.

తా. అవిరాట్టు ఆయన్నమును చెవితో గ్రహింపనభిలషించెను గాని, శక్యముకాదయ్యెను. అవిరాట్టు అన్నమును చెవితో గ్రహించి యుండినయెడల, సకలప్రాణులును అన్నమును చెవులతో వినియే తృప్తినిఁబొందును.

మూ. తత్త్వచాఽజిఘృక్షత్ తన్నాశక్నోత్ త్వచా గ్రహీతుం
స యద్ధైనత్ త్వచాఽగ్రహైష్యత్ స్పృష్ట్వా హైవాన్నమ
త్రప్స్యత్. 7

టీ. (సః=అవిరాట్టు), తత్ = అయన్నమును, త్వచా=త్వక్కుచేత, అజిఘృక్షత్ = గ్రహింపనిచ్ఛయించెను. తత్ = అయన్నమును, త్వచా= త్వక్కుచేత, గ్రహీతుం = పట్టుటకు, (గ్రహించుటకు) న అశక్నోత్ = సమర్థముకాలేదు, సః=అవిరాట్టు, ఏనత్ హ = ఈయన్నమును, త్వచా =

త్వక్కుచేత, అగ్రహైష్యత్ యత్ = గ్రహించియుండినయెడల, (సర్వః = సమస్తమైన), (ప్రాణీ = ప్రాణియును,) అన్నం = ఆహారమును, స్పృష్ట్వాహ ఏవ = తాఁకియే, అత్రప్స్యత్ = తృప్తినొందును.

తా. ఆవిరాట్టు త్వక్కుచే అన్నమును గ్రహింపఁగోరియు సాధ్యము కాదయ్యెను. ఆవిరాట్టు ఆయన్నమును త్వక్కుచే గ్రహించియుండిన, యెడల సకలప్రాణులును అన్నమును స్పృశించియే తృప్తినొందును.

మూ. తన్మనసా ఉజిఘృక్షత్ తన్నాశక్నో న్మనసాగ్రహీతుమ్ స యద్ధైన న్మనసా ఉగ్రహైష్యద్ధ్యాత్వా హైవా న్న మత్రప్స్యత్. 8

టీ. (సః = ఆవిరాట్టు); తత్ = ఆయన్నమును, మనసా = మనస్సుచేత, అజిఘృక్షత్ = గ్రహింపఁగోరెను; తత్ = ఆయన్నమును, మనసా = మనస్సుచేత, గ్రహీతుం = గ్రహించుటకు, నఅశక్నోత్ = సమర్థము కాకపోయెను. సః = ఆవిరాట్టు, ఏనత్ హ = ఈయన్నమును, మనసా = మనస్సుచేత, అగ్రహైష్యత్ యత్ = గ్రహించియుండినయెడల, (సర్వః = సకలమైన,) (జన్తుః = జంతువులును), అన్నం = ఆహారమును, ధ్యాత్వాహ ఏవ = తలంచియే, అత్రప్స్యత్ = తృప్తినొందును.

తా. ఆవిరాట్టు ఆయన్నమును మనస్సుచే గ్రహించుటకుఁ గోరెను, అయినను, దానిని గ్రహించుటకుశక్తి కలది కాదయ్యెను. ఆవిరాట్టు ఆయన్నమును మనస్సుచే గ్రహించి యుండునేని సకలప్రాణులును అన్నమును తలంచియే తృప్తినొందును.



మూ. తచ్ఛిశ్నేనా ఉజిఘృక్షత్ తన్నాశక్నో చ్ఛిశ్నేన గ్రహీతుం సయద్ధైన చ్ఛిశ్నేనా గ్రహైష్య ద్విసృజ్య హైవా న్న మత్రప్స్యత్. 9

టీ. (సః = ఆవిరాట్టు), తత్ = ఆయన్నమును, శిశ్నేన = శిశ్నముచేత, అజిఘృక్షత్ = గ్రహింపఁగోరెను, తత్ = ఆయన్నమును, శిశ్నేన = శిశ్నముచేత, గ్రహీతుం = గ్రహించుటకు, న అశక్నోత్ = సమర్థము కాకపోయెను. సః = ఆవిరాట్టు, ఏనత్ హ = ఈయన్నమును, శిశ్నేన = శిశ్నముచేత, అగ్రహైష్యత్ యత్ = గ్రహించియుండినయెడల, (సర్వః = సకలమైన), (ప్రాణీ = ప్రాణియును), అన్నం = ఆహారమును, విసృజ్య హ ఏవ = విసర్జించియే (మలముగావిసర్జించియే). అత్రప్స్యత్ = తృప్తినొందును.

తా. ఆవిరాట్టు అన్నమును శిశ్నముతో గ్రహించుటకు ఇచ్ఛయించియు సాధ్యము కాకపోయెను. ఆయన్నమును విరాట్టు తనశిశ్నముచే గ్రహించి యుండునేని యిప్పుడు సకలప్రాణులును అన్నమును విసర్జించియే శిశ్నముతో తృప్తి నొందును.

మూ. తదపానేనా జిఘృక్షత్ తదావయత్ సఏషోఽన్నస్య గ్రహో యద్వాయు రన్నాయు ర్వా ఏషయద్వాయుః. 10

టీ. (సః = ఆవిరాట్టు), తత్ = ఆయన్నమును, అపానేన = అపానవాయువు (ముఖరంధ్రము)తో, అజిఘృక్షత్ = గ్రహింపఁగోరెను. తత్ = ఆయన్నమును, అవయత్ = గ్రహించెను, (భుజించెను) యత్ వాయుః = ఏ

అపానవాయువు, అన్నస్య గ్రహః=అన్నమును గ్రహించునదిగా, (భవతి=అయినదో) సః=అ, ఏషః=ఇది, యత్ వాయుః = ఏ అపానవాయువుగా, (వర్తతే=ఉన్నదో, (సః=అది), అన్నాయుః=అన్నమును జీవనముగాఁగలదియై, (భవతి=ఉన్నది).

తా. అవిరాట్టు ఆయన్నమును అపానముతో (ముఖద్వారముతో) గ్రహించుటకు అభిలషించెను. ఆప్రకారమె గ్రహించెను. (భక్షించెను.) ఆ అపానవాయువు అన్నమునే జీవనముగాఁగలది యాయెను. (విరాట్పురుషునకు అయన్నమును వాక్కు, ఘ్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, త్వక్కు, మనస్సు, శిశ్నము, అనువీనిచే గ్రహించుటకు సాధ్యము కాకపోయెను.

అట్లు సాధ్యమై యుండినయెడల, లోకములో సకల జంతువులును అన్నమును నోటితో చెప్పియు, ముక్కుతో మూర్కొనియు, కంటితోఁజూచియు, చెవులతో వినియు, చర్మముచే స్పర్శించియు, మనస్సుచే తలంచియు, శిశ్నముతో విసర్జించియు తృప్తినిఁబొందును. పిమ్మట అవిరాట్పురుషుఁడు ఆయన్నమును అపానవాయువుచే ముఖద్వారము మూలముగా గ్రహించి భుజించెను. ఆహారమును అపానవాయువు ముఖద్వారమువలననే గ్రహించుచున్నది. ఆహారమే సకలప్రాణులకును జీవనముగానున్నదనుట సకలజనవేద్యమై యున్నది.)

మూ. స ఈక్షత కథం న్విదం మదృతే స్యాదితి స ఈక్షత కత
రేణ ప్రపద్యా ఇతి, స ఈక్షత యదివాచా ఽభివ్యాహృతం
యది ప్రాణే నాభిప్రాణితం యది చక్షుషాదృష్టం యదిశ్రోత్రేణ



శ్రుతం యది త్వచా స్పృష్టం యదిమనసా ధ్యాతం యద్య
పానే నాభ్యపానితం యది శిశ్నేన విసృష్ట మథకోఽహమితి.

టీ. సః = ఆపరమేశ్వరుఁడు, ఇదం = ఈ దేహేంద్రియాదిసంఘాతము, మదృతే = నేను లేనియెడల, కథం=ఏప్రకారము, స్యాత్ను=ఉండును? ఇతి = అని, ఈక్షత = ఆలోచించెను. సః = ఆయీశ్వరుఁడు, కతరేణ=రెంటిలో దేనిచేత (ఏమార్గము ద్వారముగా) ప్రపద్యే=పొందుదును (ప్రవేశింతును?) ఇతి=అని, ఈక్షత=ఆలోచించెను. సః=ఆపరమాత్మ, వాచా=వాక్కుచేత, అభివ్యాహృతంయది=మాటలాడునెడల, ప్రాణేన=ప్రాణవాయువు (ఘ్రాణము) చేత, అభిప్రాణితం యది=ప్రాణవ్యాపారము చేయునెడల, చక్షుషా=నేత్రముచేత, దృష్టం యది=చూడఁబడునెడల, శ్రోత్రేణ=చెవిచేత, శ్రుతంయది=వినఁబడినయెడల, త్వచా=చర్మముచేత, స్పృష్టం యది=తాఁకుటయగునెడల, మనసా=మనస్సుచేత, ధ్యాతం యది=తలంచుటయగునెడల, అపానేన = అపానవాయువుచేత, అభ్యపానితం యది=మ్రింగుటయగునెడల, శిశ్నేన= మేఢ్రముచేత, విసృష్టంయది=విసర్జనముచేయునెడల, అథ=అప్పుడు, అహం=నేను, కః=ఎవఁడను? ఇతి=అని, ఈక్షత=ఆలోచించెను.

తా. ఆయీశ్వరుఁడిట్లు లోకములను లోకపాలకులను సృష్టించి, ఆహారమును కలుగఁజేసిన పిమ్మట, పట్టణమునకు రక్షకులెట్లో అట్లు శరీరమను పట్టణమునకు రక్షకులవంటి అగ్న్యాదిదేవతలను ప్రవేశింపఁజేసి, తాను లేనియెడల ఎట్లుజీవించునని ఆలోచించెను. నేను, పట్టణమునకు రాజు

వలె సేవకులు, చేయునట్టి స్తోత్రములాదిగాఁ గలవానికి సాక్షియై యుండు నట్లే, దేహేంద్రియాదిసకలవ్యాపారములకును తాను సాక్షియై, వీనిని అనుభవించు భోక్తయై యుండెద నని నిశ్చయించి, నేను ఈశరీరములో నేమార్గముగాఁ బ్రవేశింపనగును? ఈ వాగాదీంద్రియములచేఁ జేయంబడు వ్యాపారముల నన్నిటిని ప్రత్యేకప్రత్యేకముగా ఇది ఇది యని విభజించి తెలిసికొనెడి నేను ఎవఁడను? అని విచారించెను.

(పాదాగ్రము, శిరస్సు ఈరెండును ఈసంఘాతమునకు ప్రవేశమార్గములు. నేను ఈకార్యకారణసంఘాతమైననగరమునం దీరెంటిలో నేమార్గముగాఁ బ్రవేశింతు నని యాలోచించెను).

మూ. స ఏత మేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత, సైషా విదృతి ర్నామ ద్వాస్తదేత న్నాన్దనమ్, తస్య త్రయ ఆవసథా స్త్రయః స్వప్నా అయ మావసథోఽయ మావసథోఽయ మావసథ ఇతి. 12

టీ. సః=ఆయీశ్వరుఁడు, ఏతమ్ ఏవ = ఈ, సీమానం=జొదలను (శిరోగ్రభాగమును), విదార్య=చీల్చి, ఏతయా ద్వారా = ఈమార్గముగా, (ఇమం=ఈదేహేంద్రియ సంఘాతమును), ప్రాపద్యత = పొందెను. సా ఏషా ద్వాః=ఆ ఈద్వారము, విదృతిః నామ=విదృతి యను పేరుకలది. తత్ ఏతత్=ఆ ఈమార్గము, నాన్దనం=నాన్దనమనఁబడును. తస్య=జీవరూపముతోఁ బ్రవేశించిన పరమాత్మకు, త్రయః=మూఁడు, అవసథాః=నివాసస్థానములు (కలవు) త్రయః=మూఁడు, స్వప్నాః=స్వప్నములు (కలవు) అయం=ఇది,



అవసథః=స్థానము (మొదటిది) అయం=ఇది, స్థానం=స్థానము (రెండవది) అయం=ఇది, స్థానం=స్థానము (మూఁడవది) ఇతి=అని.

తా. ఆపరమాత్మ, సంకార్యముల నన్నిఁటిని నెఱవేర్చుటకు నానేవకుఁడైన ప్రాణము ప్రవేశించుమార్గములు రెంటిలో నేను శిరోగ్రభాగమును (బ్రహ్మరంధ్రమును) భేదించికొనియే ప్రవేశింతును గాక యని నిశ్చయించి కపాలమును చీల్చికొని ప్రవేశించెను. (చీల్పఁ బడినది. గనుక "విదృతి" యనఁబడెను) ఇట్లు ఈమార్గము ద్వారముగాఁ జొచ్చి బ్రహ్మానందము ననుభవించుటం బట్టి అస్థానము నానందమనఁబడెను. (నందనము అనునది ఛాందసవ్యవహారమునందు నాందనమనఁబడినది.) ఇట్లు ప్రవేశించిన జీవాత్మకు

(క్రీడాస్థానములు) మూఁడుస్థానములు కలవు. జాగ్రత్కాలమునందు కుడికన్ను, స్వప్నకాలమునందు మనస్సు, సుషుప్తికాలమునందు హృదయాకాశము, అను నివి స్థానములు. ఇచ్చట జాగ్రత్స్వప్నసుషుప్తులను నివి మూఁడును స్వప్నములుగాఁ జెప్పఁబడియున్నది. జాగ్రత్తు కూడ స్వప్నమే. ఎట్లన, పరమార్థజ్ఞానము లేనందున జాగ్రత్తయు స్వప్నము వంటిదిగా నున్నది. ఇది వివేకులకు సమ్మతమైనది. ఇది స్థానము అని ముమ్మాఱుచ్చరించుట ఆదరాతిశయముచే నని యెఱుంగునది.

మూ. స జాతో భూతా న్యభివైక్ష్యత్ కి మిహాన్యం వావదిష దితి, స ఏత మేవ పురుషం బ్రహ్మ తతమమపశ్యదిద మదర్శమితీ. 13

టీ. సః=ఆపరమాత్మ, జాతః సన్=జీవరూపముగాఁ బుట్టినవాఁడై,

భూతాని=భూతములను (వస్తువులను) అభివ్యైక్షత్=అభిముఖముగాఁజూచెను. (దేహేంద్రియతాదాత్మ్యభ్రమచే నేను మనుష్యుఁడను, నేను గ్రుడ్డివాఁడను, నేను ఖువంతుఁడను, అని యిట్లు స్పష్టముగా ఆలోచించెను) ఇహ=ఈశరీరమునందు, అన్యం = ఆత్మస్వరూపముకంటె వేఱైనదానిని, వావదిషత్ కిం=చెప్పుదునా? (అనఁగా చెప్పను.) ఇతి=అని, సః=ఆజీవాత్మ, ఏతమ్ ఏవ=ఇదే, పురుషం=పురుషుఁడుగా, తతతమం=వ్యాప్తమైన, బ్రహ్మ=బ్రహ్మమును, అపశ్యత్=చూచెను. ఇదం=దీనిని అదర్శం=చూచియున్నాను, ఇతీః=అని.

తా. ఆపరమాత్మ, శరీరమునందు జీవాత్మగాఁ బ్రవేశించి జననమరణాదులచే సంకటమొంది, భూమ్యాకాశములను, సకలజీవులనుజూచి, నేను

ఇవన్నియు బ్రహ్మమునకంటె భిన్నమైన వనిచెప్పుదునా ? ఏమిట్టి? అని ఆలోచించి, బ్రహ్మమున కంటె భిన్నమైన దేదియు లేదని నిశ్చయించెను. ఎట్లన, దేహేంద్రియాదులయందలి తాదాత్మ్యభ్రమచేత నేను మనుష్యుఁడను, నేనుగ్రుడ్డివాఁడను, నేను సుఖవంతుఁడను, నేను దుఃఖవంతుఁడను అని, యిట్లు శరీరసంబంధ మగు కార్యములన న్నిటిని తనవి గానే తలంచి, ఆత్మ లేదనియెంచి యుండు నప్పుడు; పరమకృపానిధి యగు ఆచార్యునిచే ఆత్మజ్ఞానబోధము నొసంగుటకై శబ్దించుచున్న వేదాంతభేరి శ్రోత్రమునందు మ్రోగుచుండఁగా, శరీరమునఁ జొచ్చియున్న జీవాత్మను ఆకాశమువలె సర్వత్ర వ్యాపించియున్న పరబ్రహ్మమని తెలిసికొని ఆశ్చర్యమొందెను. (తతతమమ్ ఇచ్చట మూలమునం దొకతకారము లోపించినది)

మూ. తస్మాదిదన్ద్రో నామేదన్ద్రో హ వై నామతమిదన్ద్రం



సన్తమిన్ద్ర ఇత్యాచక్షతే పరోక్షేణ, పరోక్షప్రియా ఇవ హి దేవాః పరోక్షప్రియా ఇవ హి దేవాః.

ఇతి తృతీయః ఖణ్డః.

టీ. తస్మాత్=ఆకారణమువలన, (ఈశ్వరః=ఈశ్వరుఁడు) ఇదన్ద్రః నామ=(ఈ ప్రత్యక్ష మగుపరమాత్మయే) ఇదంద్రుఁడను పేరుగలవాఁడుగా, (భవతి=అగుచున్నాఁడు), ఇదన్ద్రః నామ హ వై=ఇదంద్రుఁడను ప్రసిద్ధి కలవాఁడు. ఇదన్ద్రం=ఇదంద్రుఁడుగా, సన్తం=ఉండునట్టి, తం=వానిని, ఇన్ద్రః=ఇంద్రుఁడు, ఇతి=అని, (జ్ఞానినః=వివేకులు) పరోక్షేణ=అప్రత్యక్షముగా, ఆచక్షతే=చెప్పుచున్నారు. హి=ఏలన, దేవాః=దేవతలు(జ్ఞానులు) పరోక్షప్రియాః ఇవ=అప్రత్యక్షమునం దిష్టముకలవారేకదా.

తా. జీవాత్మ అపరబ్రహ్మమును ప్రత్యక్షముగాఁ జూచినందున "ఇదంద్రుఁడు" అని అపరబ్రహ్మమునకు ప్రసిద్ధి యాయెను. ఇదంద్రుఁడను అయీశ్వరుఁడు అప్రత్యక్షమునందు ఇష్టులగువారలచే "ఇంద్రుఁడు" అని వ్యవహరింపఁబడుచున్నాఁడు. అనఁగా ప్రత్యక్షముగాఁ గనంబడిన అపరబ్రహ్మమునకు ఇదంద్రుఁ డనియే పేరు. అయినను ప్రత్యక్షముగాకయుండు అపరబ్రహ్మమును ఇంద్రుఁడని యేజ్ఞానులు వ్యవహరించెదరు. (పెద్దల పేరు చెప్పుట సంప్రదాయమునకు విరుద్ధముగాన, ఇదంద్రుని వర్ణలోపముచేసి ఇంద్రుఁడనెదరు.) ఇచ్చట "పరోక్షప్రియాః" అని రెండుమాఱు లుచ్చరించుట అధ్యాయసమాప్తికొఱకని గ్రహించునది).

ఇది తృతీయఖండము.

ఐతరేయోపనిషత్తునందు ప్రథమాధ్యాయము సమాప్తము.

---



హరిః ఓమ్.

ఋగ్వేదీయ

# ఐతరేయోపనిషత్తు

## ద్వితీయోఽధ్యాయః.

---

### అథ ప్రథమః ఖణ్డః.

మూ. ఓమ్ పురుషేహ వా అయమాదితో గర్భో భవతి యదే తద్రేత స్తదేతత్సర్వేభ్యో ఽంగేభ్య స్తేజః సంభూ
తమాత్మన్యేవాఽఽత్మానం బిభర్తి తద్యదా స్త్రియాంసి ఞ్చత్యథైత జ్జనయతి తదస్య ప్రథమం జన్మ. 1

ఇతి ప్రథమఖణ్డః.

టీ. అయం వై = ఈజీవుఁడు, ఆదితః = మొదట, పురుషే హ = పురుషుని యందు, గర్భః = గర్భముగా, భవతి = అగుచున్నాఁడు. ఏతత్ = ఈ, రేతః = శుక్లము, యత్ = ఏదియో, తత్ = అదిగా, (భవతి = అగుచున్నాఁడు.) తత్ = అ, ఏతత్ = ఇది, సర్వేభ్యః = సమస్తమైన, అఙ్గేభ్యః = అవయవములనుండి, సంభూతం = కల్గిన, తేజః = సారముగా, (భవతి = కలది) (పురుషః = పురుషుఁడు) (తత్ = అ), (రేతః = రేతస్సైయున్న) ఆత్మానం = ఆత్మను, ఆత్మని ఏవ = తనయందే, బిభర్తి = భరించియున్నాఁడు. యదా = ఎప్పుడు, తత్ = దానిని స్త్రియాం = స్త్రీయందు, సిఞ్చతి = తడుపుచున్నాఁడు. (ఉంచుచున్నాఁడో), అథ = అప్పుడు, ఏనత్ = దీనిని (జీవుని) జనయతి = పుట్టించుచున్నాఁడు. తత్ = అది, అస్య = ఈజీవునియొక్క, ప్రథమంజన్మ = మొదటిజన్మము, (స్యాత్ = అగుచున్నది.)



తా. ఈజీవుఁడు అజ్ఞానమును కామ్యకర్త్రాద్యభిమానమును గలవాఁడై యజ్ఞయాగాదికర్మలనొనర్చి ధూమాదిమార్గముగా చంద్రునిఁ బొంది, కర్మనిమిత్తమైనమీఁద వర్షము మొదలగు వానిద్వారముగా ధాన్యాదులయందుఁ జేరి అన్నమై పురుషాగ్నియందు హోమముచేయఁబడి, యిట్లు ప్రవేశించియున్నజీవుఁడు రసము మొదలైనవానిమూలముగా మొదట శుక్లమై గర్భమగుచున్నాఁడు. (అనఁగా స్త్రీవలె పురుషునికి గర్భము వృద్ధి కాకపోయినను రేతస్సు (శుక్లము) పురుషునియందే ప్రథమమునఁ గల్గుచున్నది.) ఎప్పుడు పురుషుఁడు శుక్లమును స్త్రీయందుంచుచున్నాఁడో, అప్పుడు తండ్రి యగుపురుషుఁడు జీవుని సృష్టించుచున్నాఁడు. ఇట్లు పురుషదేహమునుండి (ఆత్మయందుండి) జీవుఁడు రేతోరూపమై బయటవచ్చుటయే (రేతఃపతనమే) జీవుని మొదటిజన్మము.

ఇది ప్రథమఖండము.



# ఐతరేయోపనిషత్తు.

## ద్వితీయోఽధ్యాయః.

---

అథ ద్వితీయఖణ్డః.

మూ. తత్ స్త్రియా ఆత్మభూయం గచ్ఛతి యథా స్వ మఙ్గం తథా తస్మా దేనాం హి నస్తి సాస్యైత మాత్మాన మత్ర గతం భావయతి. 1

టీ. తత్=ఆశుక్లము, స్త్రియాః=స్త్రీకి, స్వం=తనయొక్క, అఙ్గం=అవయవములు, యథా=ఏప్రకారమో, తథా=అప్రకారమే, ఆత్మభూయం =తనస్వరూపముగుటను, గచ్ఛతి=పొందుచున్నది. తస్మాత్ = అందువలన (ఆశుక్లమువలన) ఏనాం=ఈ స్త్రీని, న హినస్తి=హింసించుటలేదు. సా=ఆ స్త్రీ (గర్భిణియగు ఆ స్త్రీ) అస్య=ఈపురుషుని (భర్త) యొక్క, ఏతం ఆత్మానం=శుక్లరూపమగు ఈఆత్మను, అత్ర=ఈ తనగర్భమునందు, గతం=పొందినదానినిగా, (బుద్ధ్వా = తెలిసికొని), భావయతి = వృద్ధిపొందించుచున్నది.

తా. పురుషునిచే స్త్రీగర్భమందుంచఁబడిన శుక్లము వృద్ధినొందుచున్నప్పటికిని, స్త్రీకి స్తనాద్యవయవముల వలెనే బాధించుటలేదు. ఆ గర్భిణిస్త్రీ తనభర్త యుదరంబునందలి శుక్లము తనయుదరంబునఁ జేరినదని తెలిసికొన్నదై దానిని అనుకూలాద్యాహారాదులచే వృద్ధినొందించుచున్నది.

మూ. సా భావయిత్రీ భావయితవ్యా భవతి తం స్త్రీగర్భం బిభర్తి సోఽగ్ర ఏవ కుమారం జన్మనో ఽగ్రే ఽధిభావయతి, స యత్కుమారం జన్మనో ఽగ్రే ఽధిభావయతి, ఆత్మాన మేవ తద్భావయ త్యేషాం లోకానాం సన్తత్యా ఏవం సన్తతా హీమే లోకా స్తదస్య ద్వితీయాజన్మ.

ఇతి ద్వితీయఃఖణ్డః.

టీ. సా=ఆ స్త్రీ, (గర్భస్య=గర్భమును, భావయిత్రీ=వృద్ధిపొందించునదై, భావయితవ్యా=రక్షింపఁజేయునట్టిదిగా, భవతి=అగుచున్నది. స్త్రీ=ఆయాఁడుది, తం = ఆ, గర్భం=గర్భమును, బిభర్తి=భరించుచున్నది. సః=ఆతండు) (తస్య=ఆయొక్క) జన్మనః=పుత్త్రుఁడుపుట్టుటకు, అగ్రే ఏవ=పూర్వమును, అగ్రే=ప్రారంభమునందును, అధి=ఇంకను (పిమ్మటను), కుమారం=పుత్త్రుని, భావయతి=కాపాడుచున్నాఁడు. సః=ఆతండు, యత్=దేనిచేత, కుమారం=కుమారుని, జన్మనః=పుట్టుకకు, అగ్రే=పూర్వమును, అధి=పిమ్మటను, భావయతి=పోషించుచున్నాఁడో, తత్=దానిచేత, ఆత్మానం ఏవ=తన్నే, భావయతి=వృద్ధిపొందించుచున్నాఁడు. ఏషాం=ఈ, లోకానాం=లోకములయొక్క, సన్తత్యై=సంతతికొఱకు (అవిచ్ఛిన్నముగా నుండుటకొఱకు), (సః=ఆపురుషుఁడు) పుత్త్రం=కుమారుని) (జనయిత్వా=పుట్టించి) (భావయతి=వృద్ధిపొందించుచున్నాఁడు). హి=ఏలన, ఇమే=ఈ, లోకాః=లోకములు, ఏవం=ఈ ప్రకారముగా, సన్తతాః=ఎడఁబాటులేకవచ్చుచున్నది. తత్=ఆగర్భమునుండి బయటికివచ్చుట, అస్య=ఈఅవిద్యాకామకర్మ

ముగల జీవునికి, ద్వితీయం=రెండవదియగు, జన్మ=జన్మము (స్యాత్=అగుచున్నది).

తా. ఇట్లు గర్భమును వృద్ధిఁ బొందించుచున్న ఆస్త్రీ భర్తచేత సంరక్షింపఁబడుచున్నది. ఆస్త్రీయు ఆగర్భమును గర్భధారణవిధితో క్రమప్రకారము భరించుచున్నది. ఆతండ్రియగు పురుషుఁడును పుత్త్రజన్మమునకు ముందు,సీమంతాదికర్మములచేతను, (మంత్రజలప్రోక్షణాదులచేతను, ఆసం) సుఖప్రసవముకలుగుటకొఱకు పుత్రజన్మానంతరము జాతకర్మాదులచేతను, స్త్రీగర్భమును కాపాడుచు పోషించుచున్నాఁడు. ఇట్లాపురుషుఁడు గర్భమును సంరక్షించుట యనునది తన్నే సంరక్షించుకొనుట యగుచున్నది.ఇట్లు

పురుషుఁడు పుత్త్రోత్పాదనమును కలుగఁజేయుట యనునది ప్రపంచము యొక్క, అవిచ్ఛిన్నముకొఱకగుచున్నది. ఈప్రకారముగా సకలప్రపంచములును అవిచ్ఛిన్నముకలవి యగుచున్నవి. ఆజీవునకు ఈరీతిగా తల్లి గర్భములోనుండి కరచరణాద్యవయవములతోఁ గూడి బయలువెడలుట రెండవజన్మమగుచున్నది.

ఇది ద్వితీయఖండము.

# ఐతరేయోపనిషత్తు

## ద్వితీయోఽధ్యాయః.

---

### అథ తృతీయఃఖణ్డః.

మూ. సో ఽస్యాయ మాత్మాపుణ్యేభ్యః కర్మభ్యః ప్రతిధీయతే,
అథాస్యాయ మితర ఆత్మా కృతకృత్యో వయోగతః ప్రైతిస్స
ఇతః ప్రయన్నేవ పున ర్జాయతే త దస్య తృతీయంజన్మ. 1

ఇతి తృతీయః ఖణ్డః.

టీ. అస్య=ఆతండ్రికి, సః=ఆప్రసిద్ధుఁడగు, అయం=ఈపుత్రరూపమగు, ఆత్మా=ఆత్మ, పుణ్యేభ్యః=పుణ్యములగు, కర్మభ్యః=కర్మములకొఱకు, ప్రతిధీయతే = తనకుబదులుగా నుంచఁబడుచున్నాఁడు. అథ=అనంతరము, అస్య=ఈపుత్త్రునికి, ఇతరః=అన్యుఁడగు, అయం=ఈపితృరూపమైన, ఆత్మా=ఆత్మ, కృతకృత్యః=చేయవలసినకర్మములను చేసినవాఁడై (ఋణత్రయము వలన విడువఁబడినవాఁడై), గతవయః=పోయినవయస్సుగలవాఁడై, ప్రైతి=మృతినొందుచున్నాఁడు. సః=ఆతండ్రి, ఇతః=ఈలోకమునుండి, ప్రయన్నేవ=మరణమునుపొందినతర్వాత, పునః=మరల, జాయతే=పుట్టుచున్నాఁడు. తత్=అది, అస్య=ఈసంసారియొక్క, తృతీయం జన్మ=మూఁడవజన్మము, (స్యాత్=అగుచున్నది).

తా. ఇట్లు ఆతండ్రికి ఈపుత్త్రుఁడు శాస్త్రోక్తములగు సకలపుణ్యకర్మలు చేయుటకొఱకు తనకు బదులుగా నుంచఁబడుచున్నాఁడు. (అనఁగా, తండ్రి మరణమును పొందునపుడు కుమారునియందు నాచేత అధ్యయనముచేయఁదగిన వేదమువునీవు; నాచేయఁదగిన యజ్ఞమవునీవు. నాచే సంపాదింపఁదగిన లోకమవు నీవు. అని చెప్పి శాస్త్రోక్తకర్మలనంతయు నుంచుచున్నాఁడు. బృహ) (కుమారుఁడును అధ్యయనముచేసెదను, యజ్ఞముచేసెదను, అని అంగీకరించుచున్నాఁడు.) ఇట్లు తనపుణ్యకర్మలనంతయు కుమారుని చేయునట్లు నియమించి ఋణత్రయమునుండి విడువఁబడినవాఁడై మృతినొందుచున్నాఁడు. మృతినొందినమీఁద మరల పుట్టుచున్నాఁడు. ఇట్లు పుట్టుట మూఁడవజన్మమగుచున్నది.

అనఁగా, జీవుఁడు తండ్రిశరీరమునందు మిక్కిలి అణుచియైన రేతోరూపముగా నుండుట మొదటి జన్మము. తల్లిగర్భమునుండి కరచరణాద్యవయవములతో బయలువెడలివచ్చుట రెండవజన్మము. తండ్రి మృతినొంది వేఱొకజన్మము నెత్తుట మూఁడవజన్మము. (పితాపుత్త్రులిరువురును ఏకాత్మగలవారు గాన, తండ్రి మరణానంతరము మూఁడవజన్మముగాఁ జెప్పుట విరుద్ధముకాదు). ఈవిధముగా అవిద్యాకామకర్మము గలజీవుఁడు త్రివిధజన్మములతో సంసారమును బొందుచున్నాఁడు.

ఇది తృతీయఖండము.

---

# ఐతరేయోపనిషత్తు

## ద్వితీయోఽధ్యాయః.

---

### అథ చతుర్థః ఖణ్డః.

మూ. తదుక్తమృషిణా—గర్భేనుసన్నన్వేషామవేదమహం దేవానాం జనిమానివిశ్వా, శతంమాపుర ఆయసీ రరక్షన్నధః శ్యేనో జవసానిరదీయమితి. 1

టీక. తత్=అది, ఋషిణా = ఋషిచేత, ఉక్తం = చెప్పఁబడినది. గర్భేను=గర్భమునందే, సన్=ఉన్నవాఁడై, అహం = నేను, ఏషాం=ఈ దేవానాం=దేవతలయొక్క, విశ్వా=సమస్తములైన, జనిమాని=జన్మములను, అను=క్రమముగా, అవేదం = తెలిసికొంటిని. అధః=అధోలోకములందువలెనే, ఆయసీః=లోహమయములైన, శతః = అనేకములగు, పురః=శరీరములు (కోటలు), మా=నన్ను, అరక్షన్=రక్షించినవి, (అధః=అనంతరము) (అహం=నేను), శ్యేనః(ఇవ)=డేగవలె, జవసా = వేగముగా, నిరదీయం=బయలువెడలినవాఁడనైతిని, ఇతి=అని (జీవుఁడు పల్కెను.)

తా. వామదేవుఁడు గర్భమునందుండియే దీని నిట్లు చెప్పినాఁడు.— ఈజీవుఁడు గర్భమునందుండియే పూర్వజన్మమునందుఁ జేయఁబడిన వేదాంతశ్రవణాదిసామగ్రివశమువలన వాక్కు అగ్ని మొదలగు దేవతలయొక్క సకలజన్మములను క్రమముగాఁ దెలిసికొని యున్నాఁడను. అన్నిఁటికిని మూలకారణమైన ఆత్మస్వరూపమును తెలిసికొంటిని. లోహవికారములగు కోటలవంటి అనేకశరీరములు నన్ను అధోలోకములయందువలెనే డేగ తనసామర్థ్యము చేతవలను భేదించికొనివచ్చినట్లు, నేను ఆత్మజ్ఞానముచేఁ గల్గినసామర్థ్యముచేత పూర్వమందలిసంసార (అజ్ఞాన)బంధమునుండి బయలు వెడలివచ్చినాఁడను.

మూ. గర్భ ఏవైతచ్ఛయానో వామదేవ ఏవ మువాచ. 2

టీ. గర్భే ఏవ=గర్భమునందే, శయానః=శయనించినవాఁడై, వామదేవః=వామదేవుఁడనుఋషి, ఏతత్=దీనిని, ఏవం=ఇట్లని, ఉవాచ=పలికెను.

తా. దీనిని వామదేవమహర్షి గర్భమునందే యుండినవాఁడై యిట్లని చెప్పెను.

మూ. స ఏవం విద్వానస్మాచ్ఛరీరభేదా దూర్ధ్వ ఉత్క్రమ్యాముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్ కామా నాప్త్వా ఽమృతః సమభవత్సమభవత్.

ఇతి చతుర్థఃఖణ్డః.

టీ. సః = ఆవామదేవఋషి, ఏవం = ఈప్రకారముగా, విద్వాన్ =(ఆత్మస్వరూపమును) తెలిసికొన్నవాఁడై, సర్వాన్=సమస్తములైన, కామాన్=కోరికలను, (ఇహ ఏవ=ఇచ్చటనే), ఆప్త్వా = పొంది, అస్మాత్ = ఈ, శరీరభేదాత్=దేహనాశమువలన, ఊర్ధ్వః=పరమార్థస్వరూపుఁడై, ఉత్క్రమ్య=ఎగిరి (అధోరూపసంసారమునుండిలేచి) అముష్మిన్=ఈ, స్వర్గే=స్వర్గమైన, లోకే=(ఆత్మ)లోకమునందు, అమృతః = ముక్తుఁడుగా, సమభవత్=ఆయెను.

తా. ఆవామదేవఋషి పూర్వోక్తప్రకారము ఆత్మస్వరూపము నెఱింగినవాఁడై, జననమరణాద్యనేకార్థములను పొందియున్నశరీరబంధమునకు పరమాత్మజ్ఞానామృతమును ఉపయోగించుటవలనఁగల్గిన సామర్థ్యముచేత భేదమువలననైన జననమునకుఁ గారణమైనఅవిద్యానాశకారణమువలననైన దేహనాశమువలననుండి పరమార్థమైన బ్రహ్మస్వరూపుఁడై అధోరూపసంసారమునుండి లేచి జ్ఞానముచేఁ బ్రకాశితమైన సర్వాత్మభావమును బొందినవాఁడై ఈయాత్మలోకమునందు ఆత్మజ్ఞానముచే సకలాభీష్టములను బొంది ముక్తుఁడాయెను.

ఇది చతుర్థఖండము.

ఐతరేయోపనిషత్తునందు ద్వితీయాధ్యాయము సమాప్తము.

---

# ఐతరేయోపనిషత్తు

## తృతీయోఽధ్యాయః.

---

### అథ ప్రథమఃఖణ్డః.

మూ. ఓమ్, కో ఽయ మాత్మేతి వయ ముపాస్మహే కతరః స ఆత్మా, యేన వా(రూపం) పశ్యతియేన వా (శబ్దం)శృణోతి యేన వాగన్ధానాజిఘ్రతి యేన వా వాచం వ్యాకరోతియేన వా స్వాదు చా స్వాదు చ విజానాతి. 1



టీ. అయం=ఈ, ఆత్మా=ఆత్మ, కః=ఎది, ఇతి=అని, వయం=మనము, ఉపాస్మహే=ఉపాసించెదమో, సః=ఆ, ఆత్మా=ఆత్మ, కతరః=ఆరెంటిలో ఏది? (కశ్చిత్) = ఒకఁడు, యేనవా=దేనిచేత, (రూపం)=రూపమును, పశ్యతి = చూచుచున్నాఁడో, (తత్ కిం)=అదియా? వా=లేక, యేన=దేనిచేత, (శబ్దం) = ధ్వనిని, శృణోతి = వినుచున్నాఁడో, (తత్ కిం)=అదియా?, వా=లేక, గన్ధాన్ =వాసనను, ఆజిఘ్రతి=మూర్కొనుచున్నాఁడో, (తత్ కిం)=అదియా? వా=లేక, యేన=దేనిచేత, వార్తను = వార్తను, వ్యాకరోతి = మాటలాడుచున్నాఁడో, తత్ కిం=అదియా? వా=లేక, యేన=దేనిచేత, స్వాదు చ=మధురమును, అస్వాదు చ=మధురముకానిదానిని, విజానాతి = తెలిసికొనుచున్నాఁడో, (తత్ కిం) =అదియా ?

తా. ఈప్రకారముగా వామదేవాదులు మొదలగు ఆచార్యపరంపరగల వేదముచే బోధింపఁబడినదియును బ్రహ్మజ్ఞానుల సమాజమునందు మిక్కిలి ప్రసిద్ధమైనట్టి బ్రహ్మవిద్యాసాధనకృతసర్వాత్మభావరూపఫలమును బొందుట కిచ్ఛగలవారును ముముక్షువులు నగుబ్రాహ్మణులు జీవస్థితినిఁ బొందిన అనిత్యమైనసంసారమునుండి తరింపఁగోరినవారై "ఈఆత్మ యేది?" అని యొకరినొకరు ప్రశ్నించిరి. ఎట్లనఁగా, ఏఆత్మను, ఈయాత్మయని మనుజులు ఉపాసించెదరో ఆయాత్మ ఎది ? (అనఁగా వామదేవాదులు ఉపాసించి ముక్తినొందిన ఆత్మ ఎది?) మనము దానినే యుపాసించెదము. అని ఇట్లు పరస్పరము ప్రశ్నించికొనిన బ్రహ్మజిజ్ఞాసులకు విచారణదశయందు మున్ను బ్రహ్మరంధ్రముద్వారముగా శరీరేంద్రియములయందుఁ బ్రవేశించియుండు పరాపరములగు ఆత్మప్రాణములను ని రెంటియొక్క విశేషవిషయమును వినుట

వరుణుఁడును, చంద్రుఁడును కలిగెను. హృదయమును మనస్సునుచేరి అంతః కరణమైనది. ఈఒక్కటి యగుఅంతఃకరణసాక్షి యగుఆత్మ; నేత్రరూపమైన ఆయంతఃకరణముచే రూపమును జూచుచున్నాఁడు. శ్రోత్రరూపమైన ఆయంతఃకరణముచేతనే శబ్దమును వినుచున్నాఁడు. జిహ్వారూపమైన ఆయంతఃకరణముచేతనే శబ్దమును వినుచున్నాఁడు. జిహ్వారూపమైన ఆయంతఃకరణముచేతనే రుచిని తెలిసికొనుచున్నాఁడు. ఘ్రాణరూపమైన ఆయంతఃకరణముచేతనే గంధమును ఆఘ్రాణించుచున్నాఁడు. వాగ్రూపమైన ఆయంతఃకరణముచేతనే మాటలాడుచున్నాఁడు. తన వికల్పనారూపమగు మనస్సుచేతనే వికల్పించుచున్నాఁడు. తన హృదయస్వరూపముచేతనే నిశ్చయించుచున్నాఁడు.

ఈ అంతఃకరణము సకలవస్తువులను దెలిసికొనుటకు సాధనమై యున్నది. ఈవిషయమును "బుద్ధిచే వాక్కును అధిరోహించి (ఎక్కి) వాక్కుచే సకలనామములను గ్రహించుచున్నది, బుద్ధిచే నేత్రము నధిరోహించి సకలరూపములను గ్రహించుచున్నది. (కౌ. 3-3) ఇట్లే మనస్సుచేతనే చూచుచున్నాఁడు, మనస్సుచేతనే వినుచున్నాఁడు." (బృ. 1-5-3. మైత్రీ. 6-30) "హృదయముచేతనే రూపములను గ్రహించుచున్నాఁడు." (బృ. 3-9-20) "ఏదిప్రాణమో అదే బుద్ధి, ఏదిబుద్ధియో అదియె ప్రాణము." (కౌ-3-3) "ప్రాణమనఁగా ఇంద్రియసముదాయము". (బృ. 6-1-13) అని యనేక ప్రమాణములు కలవు.

మూ. సంజ్ఞాన మాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధాదృష్టి ర్ధృతి
ర్మతి ర్మనీషా జూతిః స్మృతిః సంకల్పః క్రతు రసుః కామో



వలన స్మృతికల్గి ఈపురుషుని అపరబ్రహ్మమునుగాఁ బొందిరి. (క-3-12). ఇచ్చట ఆత్మప్రాణము అనునిరెండుబ్రహ్మములును అన్యోన్యప్రతికూలముగా నీశరీరమునందు ప్రవేశించినవి కావున, ఈరెంటిలో ఉపాసింపఁదగిన ఆత్మయేది? అని మరల విచారింపఁ దొడంగిరి. అప్పుడు ఆముముక్షువులకు ఏకస్వరూప మగుఆత్మ, ఈదేహేంద్రియాదిసముదాయరూపమైన పిండమునందు ప్రాణము ఆత్మ అనునిరెండురూపముగా నెట్లుప్రవేశించినది ? అని విశేష విచారము చేయందొడంగిరి? ఎట్లన, ఆత్మప్రాణములురెంటిలో ఆత్మస్వరూపమునకుఁ దగియున్నదేది? అది దేనిచేతపొందఁబడుచున్నది? అని ఆకాంక్షించుకొని, మనస్సుచేతనే పొందఁబడుచున్నది. ఆమనస్సు అనేకవిధములైనది

యని శ్రుతియే బోధించుచున్నది. కావున, ఈప్రాణాత్మ, ఏనేత్రముచే రూపమును జూచుచున్నదో, ఏశ్రోత్రముచే శబ్దమును వినుచున్నదో, ఏఘ్రాణముచేత గంధము నాఘ్రాణించుచున్నదో, ఏవాగింద్రియముచే వాక్కును ఉచ్చరించుచున్నదో, ఏజిహ్వచే రుచిని అరుచిని తెలిసికొనుచున్నదో. (ఆ ఈచెప్పఁబడినయింద్రియము లగుసాధనములచేఁ దెలిసికొనుచున్నాఁడు.)

మూ. య దేత ద్ధృదయం మన శ్చైతత్. 2

టీ. ఏతత్=ఈ, హృదయం=హృదయమును, మనః చ=మనస్సును, యత్=ఏదియో, (భవతి=ఉన్నదో), (తత్)=అది, ఏతత్ = ఇదిగా, (భవతి) ఉన్నది.

తా. మున్ను ప్రాణులయొక్క సారము (రేతస్సు) వలన హృదయము, హృదయముయొక్క సారమువలనమనస్సును, మనస్సువలన జలమును,

వరుణుఁడును, చంద్రుఁడును కలిగెను. హృదయమును మనస్సును చేరి అంతః
కరణమైనది. ఈ ఒక్కటి యగు అంతఃకరణసాక్షి యగు ఆత్మ; నేత్రరూప
మైన ఆయంతఃకరణముచే రూపమును జూచుచున్నాఁడు. శ్రోత్రరూపమై
అయంతఃకరణముచేతనే శబ్దమును వినుచున్నాఁడు. జిహ్వారూపమైన అయం
తఃకరణముచేతనే శబ్దమును వినుచున్నాఁడు. జిహ్వారూపమైన అయంతఃకరణ
ముచేతనే రుచిని తెలిసికొనుచున్నాఁడు. ఘ్రాణరూపమైన ఆయంతఃకరణము
చేతనే గంధమును ఆఘ్రాణించుచున్నాఁడు. వాగ్రూపమైన ఆయంతఃకర
ణముచేతనే మాటలాడుచున్నాఁడు. తన వికల్పనారూపమగు మనస్సుచేతనే
వికల్పించుచున్నాఁడు. తన హృదయస్వరూపముచేతనే నిశ్చయించుచు
న్నాఁడు.

ఈ అంతఃకరణము సకలవస్తువులను దెలిసికొనుటకు సాధనమై యున్నది. ఈవిషయమును "బుద్ధిచే వాక్కును అధిరోహించి (ఎక్కి) వాక్కుచే సకలనామములను గ్రహించుచున్నది, బుద్ధిచే నేత్రము నధిరోహించి సకలరూపములను గ్రహించుచున్నది. (కౌ. 3-3) ఇట్లే మనస్సుచేతనే చూచుచున్నాఁడు, మనస్సుచేతనే వినుచున్నాఁడు." (బృ.1-5-3. మైత్రి. 6-30) "హృదయముచేతనే రూపములను గ్రహించుచున్నాఁడు." (బృ. 3-9-20) "ఏదిప్రాణమో అదే బుద్ధి, ఏదిబుద్ధియో అదియె ప్రాణము." (కౌ-3-3) "ప్రాణమనఁగా ఇంద్రియసముదాయము". (బృ. 6-1-13) అని యనేక ప్రమాణములు కలవు.

మూ. సంజ్ఞాన మాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధాదృష్టి ర్ధృతి ర్మతి ర్మనీషా జూతిః స్మృతిః సంకల్పః క్రతు రసుః కామో



వశ ఇతిసర్వాణ్యే వైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవన్తి.

టీ. సంజ్ఞానం=సంజ్ఞానము, అజ్ఞానం = అజ్ఞానము, విజ్ఞానం=విజ్ఞానము, ప్రజ్ఞానం=ప్రజ్ఞానము, మేధా=మేధస్సు, దృష్టిః=చూపు, ధృతిః=ధైర్యము, మతిః=మతి, మనీషా=మనోస్వాతంత్ర్యము, జూతిః=దుఃఖము, స్మృతిః=స్మరణము, సంకల్పః=తలంపు, క్రతుః=నిశ్చయించుట, అసుః=ప్రాణనాదిజీవనక్రియావృత్తి, కామః=కోరిక, వశః=వశము, ఇతి=ఈ మొదలగునవి, ఏతాని=ఇవి, సర్వాణిఏవ=సమస్తమును, ప్రజ్ఞానస్య=ప్రజ్ఞానముయొక్క, నామధేయాని=పేర్లు, భవన్తి=అగుచున్నవి.

తా. సంజ్ఞానము, అజ్ఞానము, విజ్ఞానము, ప్రజ్ఞానము, మేధ, దృష్టి, ధృతి, మతి, మనీష, జూతి, స్మృతి, సంకల్పము, క్రతువు, అసువు, కామము, వశము అను నివి ప్రజ్ఞానమునకు పర్యాయనామములు.

సంజ్ఞానమనఁగా, అంతఃకరణమునందు ప్రతిబింబించిన చేతన భావము. అనఁగా సకలశరీరములయందు వ్యాపించియుండెడి అంతఃకరణవృత్తి విశేషము. ఇది సంజ్ఞప్తియనియుఁ బేర్కొనంబడును.

అజ్ఞానమనఁగా, ఈశ్వరభావము అనఁగా పాలించుస్థితి దీనికి అజ్ఞప్తియనియుఁ బేరుకలదు.

విజ్ఞానమనఁగా, కలాదిపరిజ్ఞానము. అనఁగా అఱువదినాలుగుకళలవలనఁ బుట్టినలోకసంబంధజ్ఞానము.

ప్రజ్ఞానమనఁగా, తెలిసికొనుట. అనఁగా తత్కాలమున గోచరించు ప్రతిభ. ఇది ప్రజ్ఞప్తి యనియుఁ జెప్పఁబడును.

మేధయనఁగా, గ్రంథధారణసామర్థ్యము.

దృష్టియనఁగా, ఇంద్రియములమూలముగా సమస్తమును దెలిసి కొనుట.

ధృతియనఁగా, ధారణము. అనఁగా శరీరేంద్రియములు కృశించియున్నప్పుడు శరీరమును ధరించెడి ధైర్యవృత్తి.

మతియనఁగా, మననము. లేక, ఆలోచించుట.

మనీషయనఁగా, మనస్సునందలిస్వాతంత్ర్యము. అనఁగా సకలకార్యములను స్వతంత్రముగా ఆలోచించుట.

జూతియనఁగా, మనస్సునకు రోగాదిదుఃఖిత్వభావము.

స్మృతియనఁగా, అనుభవించినదానిని స్మరించుట, ఇదే స్మరణమనఁబడును.

సంకల్పమనఁగా, రూపములయొక్క శుక్లకృష్ణాదిభావములను చక్కఁగా (గ్రహించుట) సంకల్పించుట.

క్రతువనఁగా, అవశ్యము చేయుదు నని నిశ్చయించుట.

అసువనఁగా, ప్రాణనము మొదలగు జీవనక్రియానిమిత్తకమైనవృత్తి.

కామమనఁగా, సమీపమందు లేనిపదార్థములను అభిలషించుట. వశమనఁగా, స్త్రీసంబంధవ్యసనాద్యభిలాషము.

ఈపదునాఱు అంతఃకరణవృత్తులును ప్రజ్ఞానమునకు బేర్లు. ఈనామములు సర్వద్రష్టయై సర్వసాక్షియై యుండు ప్రజ్ఞప్తిరూపమైన ప్రజ్ఞానమునకు అయా అంతఃకరణవృత్తులయొక్క గుణములను బట్టి ఔపచారికముగా లక్షణావృత్తితో నొప్పుచున్నవి.

ఐతరేయోపనిషత్తు. 150

మేధయనఁగా, గ్రంథధారణసామర్థ్యము.

దృష్టియనఁగా, ఇంద్రియములమూలముగా సమస్తమును దెలిసి కొనుట.

ధృతియనఁగా, ధారణము. అనఁగా శరీరేంద్రియములు కృశించియున్నప్పుడు శరీరమును ధరించెడి ధైర్యవృత్తి.

మతియనఁగా, మననము. లేక, ఆలోచించుట.

మనీషయనఁగా, మనస్సునందలిస్వాతంత్ర్యము. అనఁగా సకలకార్యములను స్వతంత్రముగా ఆలోచించుట.

జూతియనఁగా, మనస్సునకు రోగాదిదుఃఖిత్వభావము.

స్మృతియనఁగా, అనుభవించినదానిని స్మరించుట, ఇదే స్మరణమనఁబడును.

సంకల్పమనఁగా, రూపములయొక్క శుక్లకృష్ణాదిభావములను చక్కఁగా (గ్రహించుట) సంకల్పించుట.

క్రతువనఁగా, అవశ్యము చేయుదు నని నిశ్చయించుట.

అసువనఁగా, ప్రాణనము మొదలగు జీవనక్రియానిమిత్తకమైనవృత్తి.

కామమనఁగా, సమీపమందు లేనిపదార్థములను అభిలషించుట. వశమనఁగా, స్త్రీసంబంధవ్యసనాద్యభిలాషము.

ఈపదునాఱు అంతఃకరణవృత్తులును ప్రజ్ఞానమునకు బేర్లు. ఈనామములు సర్వద్రష్టయై సర్వసాక్షియై యుండు ప్రజ్ఞప్తిరూపమైన ప్రజ్ఞానమునకు అయా అంతఃకరణవృత్తులయొక్క గుణములను బట్టి ఔపచారికముగా లక్షణావృత్తితో నొప్పుచున్నవి.

మూ. ఏష బ్రహ్మ ఏష ఇన్ద్ర ఏష ప్రజాపతి రేతే సర్వే దేవా ఇమాని చ పఞ్చమహాభూతాని పృథివీవాయురాకాశ ఆపో జ్యోతీంషీ త్యేతానీమాని చక్షుద్రమిశ్రాణీ వ, బీజానీతరాణి చేతరాణి చాణ్డజాని చ జారుజాని చ స్వేదజాని చోద్భిజ్జాని చాశ్వాగావః పురుషా హాస్తినో యత్కిఞ్చేదం ప్రాణి జఙ్గమంచ పతత్రి చ యచ్చ స్థావరం సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ.

టీ. ఏషః=ఇది, బ్రహ్మ=బ్రహ్మముగా (భవతి=ఉన్నది.) ఏషః=ఇది, ఇన్ద్రః=ఇంద్రుఁడుగా, (భవతి=ఉన్నది.) ఏషః=ఇది, ప్రజాపతిః=ప్రజాపతిగా, ఏతే=ఈ, సర్వే=సమస్తమైన, దేవాః=దేవతలుగా, (భవతి=ఉన్నది.) చ=ఇఁక, ఇమాని=ఈ, మహాభూతాని=మహాభూతములు, పఞ్చ=ఐదుగా, (భవన్తి=ఉన్నవి.) ఏతాని=ఇవి, పృథివీ=భూమి, వాయుః=వాయువు, ఆకాశః=ఆకాశము, ఆపః=జలము, జ్యోతీంషి=అగ్ని, ఇతి=అని, (ఉచ్యన్తే=చెప్పఁబడుచున్నవి), చ=మఱియు, ఇమాని = ఇవి, క్షుద్రమిశ్రాణిఇవ, అల్పములతోఁగూడినవిగా, బీజాని= బీజములుగా, ఇతరాణిచ=వేఱైనవిగా, (భవన్తి = అగుచున్నవి) అణ్డజానిచ = గ్రుడ్డునందుండి కలుగునవి, జారుజానిచ = కోశమునందుండి కలుగునవి, స్వేదజానిచ = చెమ్మటయందుండి కలుగునవి, ఉద్భిజ్జానిచ=భూమినిచీల్చుకొని కలుగునవి, అశ్వాః=గుఱ్ఱములు,



గావః=ఆవులు, పురుషాః=మనుష్యులు, హస్తినః=ఏనుఁగులు, కించ=మఱియును, యత్=ఏది, ఇదం=ఈ, ప్రాణి=జంతువుగా, జఙ్గమంచ=పాదములతో నడుచునదిగా, పతత్రి చ=పక్షులుగా, (భవతి=ఉన్నవో), చ=మఱియు, యత్=ఏది, స్థావరం=స్థావరముగా (భవతి=ఉన్నవో) తత్=అది, సర్వం=సర్వమును, ప్రజ్ఞానేత్రం=జ్ఞానమే నేత్రముగాఁగలదిగా, ప్రజ్ఞానే=జ్ఞానమునందు, ప్రతిష్ఠితం=ఉంచబడినది. లోకః=ప్రపంచము, ప్రజ్ఞానేత్రః=జ్ఞానమే నేత్రముగాఁగలదిగా, (భవతి=ఉన్నది.) ప్రజ్ఞా=జ్ఞానము, ప్రతిష్ఠా=స్థితిగా (భవతి=ఉన్నది) ప్రజ్ఞానం=జ్ఞానము, బ్రహ్మ=బ్రహ్మస్వరూపముగా, (భవతి=ఉన్నది).

తా. ఈప్రజ్ఞానాత్మయే అంతఃకరణమునందు జలమునందు ప్రతిఫలించినసూర్యబింబమువలె ప్రవేశించియుండు హిరణ్యగర్భుఁడను పేరుగల ప్రాణరూప మగుఆత్మ. ఈప్రజ్ఞానాత్మయే దేహేంద్రియాదులయందు జీవరూపముతోఁ బ్రవేశించిన ఇంద్రుఁడను పేరుగల ఆత్మ. ఈప్రజ్ఞానాత్మయే అగ్న్యాదిసకలదేవతలును, భోక్తృభోజ్యములగు అన్నాన్నాదలక్షణములైన పృథివ్యప్తేజోవాయ్వాకాశములను పంచమహాభూతములును, సర్పములు మొదలగు నవియును, పక్షులు మొదలగు నవియును, మనుష్యులు మొదలగు నవియును, దోమలు మొదలగునవియును, వృక్షములు మొదలగు నవియును, గుఱ్ఱములు గోవులు మనుజులు ఏనుఁగులు పక్షులు చలింపనివస్తువులుగానున్నవి. ఈప్రపంచమంతయు ప్రజ్ఞానమునందే ప్రతిష్ఠింపఁబడియున్నది. ఈప్రజ్ఞానమే శాశ్వతమైన బ్రహ్మస్వరూపము.

అనఁగా సమస్తమును ప్రజ్ఞానమను పేరుగల పరమాత్మ (బ్రహ్మ) స్వరూపము. ప్రజ్ఞానేత్రమనఁగా, ప్రజ్ఞయే (జ్ఞానమే) నేత్రముగాఁగలది. దేనిచేచూడఁబడుచున్నదో అదినేత్రము. సర్వప్రపంచమును జ్ఞానమునే

నేత్రముగాఁ గలిగియున్నది. బ్రహ్మాదిస్తంబపర్యంతమును పరమాత్మస్వరూపమని ముఖ్యాభిప్రాయము.

మూ. స ఏతేన ప్రజ్ఞేనాఽఽత్మనాఽస్మాల్లోకా దుత్క్రమ్యా

ముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్ కామా నాప్త్వాఽమృతః

సమభవత్ సమభవత్ ఇతి ఓమ్.

ఇత్యైతరేయే ద్వితీయే ఆరణ్యకే షష్ఠోఽధ్యాయః.

ఇతి ఐతరేయోపనిషది తృతీయాధ్యాయే ప్రథమఃఖణ్డః.

టీ. సః=వామదేవుఁడు, ఏతేన=ఈ, ప్రజ్ఞేన=ప్రజ్ఞానమైన, ఆత్మనా=ఆత్మగా, అస్మాత్=ఈ, లోకాత్=లోకమునుండి, ఉత్క్రమ్య=ఎగిరి, అముష్మిన్=ఈ, స్వర్గే=స్వర్గమైన, లోకే=లోకమునందు, సర్వాన్=సమస్తములైన, కామాన్=కోరికలను, ఆప్త్వా=పొంది, అమృతః=మరణములేనివాఁడుగా, సమభవత్=ఆయెను. సమభవత్=ఆయెను. ఇతి=సమాప్తము. ఓమ్=శుభము.

తా. పూర్వులు ఏప్రజ్ఞానమును (బ్రహ్మమును) దెలిసికొని ముక్తులైరో, ఆప్రజ్ఞానాత్మచేతనే వామదేవుఁడు (మొదలగువారు) ను ఈలోకమునుండి (దేహాత్మజ్ఞానమునుండి) గూటియందుండి పక్షి యెగిరిపోవునట్లుగా, ఈశరీరమునుండి లేచిపోయి పరమానందస్వరూపమైన ఆత్మలోకమును జేరి సకలకోరికలను బొంది ముక్తుఁడాయెను. ఓమ్.

ఇది రెండవదగు ఐతరేయారణ్యకమునందు ఆఱవయధ్యాయము

ఐతరేయోపనిషత్తునందు తృతీయాధ్యాయము ప్రథమఖండము.

ఐతరేయోపనిషత్తు సమాప్తము.

ఓమ్ తత్సత్.

ఉత్తరశాన్తిః.

ఓమ్ ఉదితః శుక్రియం దధే, త మహా మాత్మని దధే,అనుమా మైత్విన్ద్రియమ్, మయి శ్రీ ర్మయి యశః, సర్వః సప్రాణః సబలః, ఉత్తిష్ఠా మ్యనుమాశ్రీః, ఉత్తిష్ఠ త్వనుమాఽఽయన్తు దేవతాః, అదబ్ధం చక్షు రిషితం మనః, సూర్యోజ్యోతిషాం శ్రేష్ఠోదీక్షేమా మాహింసీః, తచ్చక్షు ర్దేవహితం శుక్రముచ్చరత్, పశ్యేమ శరదః శతంజీవేమ శరదఃశతమ్, త్వమగ్నే ప్రతపా అసిదేవ ఆమర్త్యేష్వా, త్వం యజ్ఞేష్వీడ్యః.

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః.

---

# ఐతరేయోపనిషత్సారసంగ్రహము.

---

ప్రథమాధ్యాయ ప్రథమఖండసారము.

ఈ ప్రపంచమునందు ఏదేది భోజనాదివ్యాపారములు గలవిగా నుండునో అవి యంతయు సంసారస్వరూపమైనది. భోజనాదివ్యాపారశూన్యమైనదేదియో అది కేవలము పరబ్రహ్మస్వరూపమైనది. ఈపరబ్రహ్మజ్ఞానమే మోక్షసాధనమైనది. మున్ను అపరబ్రహ్మజ్ఞానమునకును కర్మజ్ఞానములకును విరోధము లేదని వచించినదానినే సవిశేషనిర్విశేషములో నిగ్రహించి

కేవలము క్రియాశూన్యమైన పరబ్రహ్మైక్యజ్ఞానమును బోధించుచున్నాఁడు. ఎట్లన, అలలు, నురుగు మొదలగునవి నీళ్లకంటె వేఱుకానట్లు, ప్రపంచసృష్టికి పూర్వము, మనకు గోచర మగుసకలపదార్థములును సత్తామాత్రమైన కేవల పరబ్రహ్మస్వరూపముగానే యున్నది. దీని కన్యమైన దెద్దియును లేదు. కావున ఆత్మయొకటి మాత్రమేయుండినది. ఆయాత్మప్రాణులకర్మఫల భోగ్యస్థానములను సృజియింపవలయు నని తలంచెను. ఇట్లు తలంచి వడ్రంగి గృహాదులను నిర్మించునట్లును, ఐంద్రజాలికుఁడు తన్నే వేఱురూపముగాఁ గావించికొని వర్తించునట్లును, సర్వశక్తియుక్తుఁడగు ఆపరమాత్మ ద్యులోకమును, అంతరిక్షలోకమును, భూలోకమును, పాతాళాదిలోకములను సృజించెను. ఇట్లు సకలప్రాణులయొక్క కర్మఫలములకును, కర్మసాధనములకును అధిష్ఠానము లగులోకములను నిర్మించెను.

ఇట్లు నిర్మించినలోకములను పరిపాలించువారు లేనిచో నశించునని యెంచి, ఆపరమాత్మ, తానుసృష్టించినలోకములకు సాధనములైనపంచభూతములనుండియే పురుషునెత్తి, కుమ్మరి మంటిముద్దనెత్తి కుండయొక్క అవయవమును నిర్మించునట్లు, శిరఃపాణ్యాద్యవయవములు కలవానినిఁగా నొనర్చెను.

ఇట్లు సృష్టించినపురుషుని ముఖద్వారమునుండి వాగింద్రియమును, ఆయింద్రియమునుండి వాగధిష్ఠానదేవతయగు అగ్నియు కలిగెను. ఈరీతిగానే నాసారంధ్రములును, వానియందలి ఘ్రాణేంద్రియమును, దానికధిష్ఠానదేవత యగువాయువును, కలిగెను. పిమ్మట నేత్రగోళములును, వానివలన నేత్రేంద్రియమును, దానివలన దానికధిష్ఠానదేవత యగుసూర్యుఁడును కలిగెను.



ఐతరేయోపనిషత్తుసారసంగ్రహము. 160

కేవలము క్రియాశూన్యమైన పరబ్రహ్మైక్యజ్ఞానమును బోధించుచున్నాఁడు. ఎట్లన, అలలు, నురుగు మొదలగునవి నీళ్లకంటె వేఱుకానట్లు, ప్రపంచసృష్టికి పూర్వము, మనకు గోచర మగుసకలపదార్థములును సత్తామాత్రమైన కేవల పరబ్రహ్మస్వరూపముగానే యున్నది. దీని కన్యమైన దెద్దియును లేదు. కావున ఆత్మయొకటి మాత్రమేయుండినది. ఆయాత్మప్రాణులకర్మఫల భోగ్యస్థానములను సృజియింపవలయు నని తలంచెను. ఇట్లు తలంచి వడ్రంగి గృహాదులను నిర్మించునట్లును, ఐంద్రజాలికుఁడు తన్నే వేఱురూపముగాఁ గావించికొని వర్తించునట్లును, సర్వశక్తియుక్తుఁడగు ఆపరమాత్మ ద్యులోకమును, అంతరిక్షలోకమును, భూలోకమును, పాతాళాదిలోకములను సృజించెను. ఇట్లు సకలప్రాణులయొక్క కర్మఫలములకును, కర్మసాధనములకును అధిష్ఠానము లగులోకములను నిర్మించెను.

ఇట్లు నిర్మించినలోకములను పరిపాలించువారు లేనిచో నశించునని యెంచి, ఆపరమాత్మ, తానుసృష్టించినలోకములకు సాధనములైనపంచభూతములనుండియే పురుషునెత్తి, కుమ్మరి మంటిముద్దనెత్తి కుండయొక్క అవయవమును నిర్మించునట్లు, శిరఃపాణ్యాద్యవయవములు కలవానినిఁగా నొనర్చెను.

ఇట్లు సృష్టించినపురుషుని ముఖద్వారమునుండి వాగింద్రియమును, ఆయింద్రియమునుండి వాగధిష్ఠానదేవతయగు అగ్నియు కలిగెను. ఈరీతిగానే నాసారంధ్రములును, వానియందలి ఘ్రాణేంద్రియమును, దానికధిష్ఠానదేవత యగువాయువును, కలిగెను. పిమ్మట నేత్రగోళములును, వానివలన నేత్రేంద్రియమును, దానివలన దానికధిష్ఠానదేవత యగుసూర్యుఁడును కలిగెను.

6

అనంతరము శ్రోత్రగోళములును, వానివలన శ్రవణేంద్రియమును, దానివలన తదధిష్ఠానదేవత యగుదిక్కులును పుట్టెను. తరువాత త్వక్కును, దానినుండి రోమములును, వానికధిష్ఠానదేవత యగు తరుగుల్మలతాదులును కలిగినవి. పిదప అంతఃకరణాధిష్ఠానమైన హృదయమును, దానివలన మనస్సును, మనస్సువలన దానికధిష్ఠానదేవతయగు చంద్రుఁడును కలిగెను. ఆమీఁద సమస్తప్రాణస్థానమైన నాభియును, దానినుండి అపానవాయువుతోఁగూడిన పాయ్వింద్రియమును, దానినుండి దానికధిష్ఠాన దేవత యగుమృత్యువును కలిగినది. పిమ్మట శిశ్నమును, దానివలన శుక్లమును, ఆశుక్లమువలన దానికధిష్ఠానములగు జలములును కలిగెను.

ఇవ్విధముగా పరమాత్మ యుద్దేశప్రకారము పురుషాకృతియైన అండమునకు గోళములును, ఇంద్రియములును, అధిష్ఠానదేవతలును క్రమముగాఁ గల్గినవి.

ఇది ప్రథమాధ్యాయ ప్రథమఖండసారము.

---

## ప్రథమాధ్యాయ ద్వితీయఖండసారము.

ఈప్రకారముగా పరమాత్మచే సృష్టింపఁబడిన అగ్న్యాదిదేవతలు, అవిద్య, కామము, కర్మము, జన్మము, దుఃఖము అనునివియే ఉదకములుగాఁ గలదియును, క్రూరరోగములు జరామరణములు అను నివియే మకరములుగాఁ గలదియును, ఆద్యంతములు లేనిదియును, పారము లేనిదియును, ఆధారము లేనిదియును, ఇంద్రియములచేఁ గలిగినస్వల్పసుఖముచే క్షణకాలము విశ్రాంతికలదియును, జ్ఞానేంద్రియవిషయములయందలి ఆశయనెడి వాయు



చలనముచేఁ గల్గినవివిధానర్థములనెడి గొప్పతరంగములు కలదియును, రౌరవాదినరకములను బొందుటవలనఁ గల్గెడిహాహాకారముయొక్క మహాధ్వనికలదియును, సత్యము, ఆర్జవము దానము, దయ, అహింస, దమము, శమము, ధృతి మొదలగు ఆత్మగుణము లనెడిమార్గమునందలి భోజనముచే నింపఁబడిన జ్ఞాన మనెడి తెప్పకలదియును, సజ్జనసహవాసము, సర్వసంగపరిత్యాగము అను నివియె మార్గముగాఁ గలదియును, ముక్తియే తీరముగాఁగలదియును, అగు సంసారమనెడి మహాసముద్రములోఁబడిరి. పిమ్మట, ఆపరమాత్మ పురుషాకృతియైన పిండము నుద్దేశించి ఆఁకలిదప్పులను కలుగఁజేసెను. అందువలన, అగ్న్యాదిదేవతలు ఆఁకలిదప్పులకోర్వక పరమాత్మను గూర్చి

"మేము ఏయధిష్ఠానమును బొంది ఆఁకలిదప్పులను దీర్చుకొనుటకు శక్తులమగుదుమో దానిని అనుగ్రహింపుము" అని వేఁడిరి.

ఇట్లు వేఁడినందున భగవంతుఁడు ఆయుదకమునుండి పిండమునందు గోరూపమును అశ్వరూపమును గనఁబఱచగా, దేవతలు అవి మాకు నలదనిరి. తర్వాత, మనుష్యాకృతినిఁ గనఁబఱచఁగా, అది మాకు తగినయధిష్ఠానమని పల్కిరి. అప్పుడు భగవంతుఁడు ఇది ఆత్మచేతనే కావింపఁబడినది కావున, దీనియందు వాగాదివ్యాపారముల నొనర్చుటకుఁ బ్రవేశింపుఁడనఁగా, రాజు యానతిచే జోదులు నగరములోఁ బ్రవేశించునట్లు, మనుష్యాకృతియందుఁ జేరిరి. ఎట్లన,

వాగభిమానదేవత యగు అగ్ని వాగ్రూపమై ముఖబిలమునందును, వాయువుప్రాణస్వరూపమై నాసారంధ్రములయందును, సూర్యుఁడు నేత్రమై

నేత్రగోళములందును, దిక్కులు శ్రోత్రరూపమై కర్ణరంధ్రములయందును, వృక్షములు రోమరూపములై చర్మమునందును, చంద్రుఁడు మనోరూపమై హృదయమునందును, మృత్యువు అపానరూపమై నాభియందును, ఉదకములు శుక్లరూపమై లింగమునందును ప్రవేశించిరి.

ఇట్లు అగ్న్యాదిదేవతలు మనుష్యశరీరమునందుఁ బ్రవేశించినమీఁద, క్షుత్పిపాసలు తమకుఁ బ్రవేశించుటకు స్థానమును అనుగ్రహింపుమని భగవంతునిఁ బ్రార్థించిరి. అపుడు భగవంతుఁడు క్షుత్పిపాసలనుగాంచి "మీరు ధర్మస్వరూపులు. అయినను, చేతనవస్తువులం దధిష్ఠించియే మీరుభక్షింపవలసినది. కాన, మీకొఱకు అగ్న్యాది దేవతాస్వరూపములగు అధ్యాత్మాది దైవతములయందు వృత్తివిభాగముచేసెదను" అనిపల్కి, సృష్ట్యాదియందే అగ్న్యాదిదేవతలకు ఆయాభాగములను నిర్ణయించెను. కాఁబట్టియే నేఁటికిని ఏయే దేవతలకు ఏయేహవిర్భాగ మొసంగఁబడునో? ఆయాభాగము దేవతలకు క్షుత్పిపాసలగుచున్నవి.

ఇది ప్రథమాధ్యాయ ద్వితీయఖండసారము.

---

## ప్రథమాధ్యాయ తృతీయఖండసారము.

అనంతరము భగవంతుఁడు "నాచే లోకములును, లోకపాలకులును, కల్పింపఁబడి క్షుత్పిపాసలతోఁగూడినవారైరి. వీరికి అన్నము లేనిచో స్థితి కలుగదు" అని తలంచి, అగ్న్యాదులకొఱకు మున్ను చెప్పినయుదకములను స్మరించెను. వెంటనే ఆయుదకములలోనుండి కఠినమును శరీరపోషణము



నందు సమర్థతయును గలజంగమస్థావరాత్మక మగు ఆకారము కలిగెను. ఇదియే అన్నమైనది. ఆయన్నము అగ్న్యాదిలోకపాలకులను జూచి, పిల్లినిఁ జూచి యెలుక పాఱిపోవునట్లు, తన్ను భక్షింపఁగోరినలోకపాలకులనుజూచి పరుగిడిపోవుటకుఁ గోరెను.

అప్పుడు లోకములయొక్కయు లోకపాలకులయొక్కయు సమాహారస్వరూపమును, దేహేంద్రియాదిలక్షణమును నగుపిండమును, ఆయన్నమును వాక్కు, ప్రాణము, నేత్రము, శ్రోత్రము, చర్మము, మనస్సు, లింగము అనునివి క్రమముగా భుజించుటకుఁ బ్రయత్నించియు భుజించుటకు శక్తిలేనివారైరి.

కాఁబట్టియే లోకములోని ప్రజలందఱును వాగాదిక్రమముగా భుజించుటచేతను, మూర్కొనుటచేతను, చూచుటచేతను, వినుటచేతను, తాఁకుటచేతను, తలంచుటచేతను, విదలుటచేతను, సంతుష్టినొందెదరు.

ఇట్లు విరాట్పురుషుఁడాయన్నమును వాగాదీంద్రియములచే భక్షించుటకు శక్తిలేమిచే, అపానవాయువుతో ముఖబిలము మూలముగా నాయన్నమును భక్షించెను. కావున, అన్నమే జీవనముగాఁగలవాయువు అపానవాయువైనది.

ఈప్రకారముగా భోగాధిష్ఠానములైన లోకములందు భోగస్థానములైన సమష్టివ్యష్టిశరీరములయొక్క భోగసాధనములైన వాగాదీంద్రియములకు సమష్టిశరీరమగుభగవంతుని దేహమునందు లోకపాలకులుగను, వ్యష్టిశరీరములనెడి జీవశరీరములందు వాగాదీంద్రియములుగను నుండుదేవతల

భోగమునకు, అన్నపానముల మూలముగా ఇంద్రియములందుండు శబ్దాది విషయములను గ్రహించుటయే లక్షణముగాఁ గలదియును, అపానవృత్తి గల ప్రాణమునందుండు అన్నపానములను గ్రహించుటయే లక్షణముగాఁ గలదియు నగు ఆత్మకు సంసారిత్వము సిద్ధించుటకై సృష్టిక్రమము చెప్పఁబడెను.

ఇఁక సంసారము గలభోక్తను దెలియఁబఱచుటకై విరాట్టనెడి ఈశ్వరునికిఁ గలవిచారమును దెలియఁజేయుచున్నాఁడు.

అవిరాట్టు, "నేను లేనిచో దేహేంద్రియాదిసముదాయంబంతయు రాజులేని నగరమునందు రాజకార్యములన్నియు నిలిచిపోవునట్లు నిలిచి పోవును" అనియెంచి, పరిజనులుచేయు స్తుతులకు రాజు సాక్షియై యుండునట్లు, నేనును కృతాకృతములగు దేహేంద్రియాదివ్యాపారములకు సాక్షినైవీని ననుభోగించుభోక్తనై యుండవలయునని తలంచినవాఁడై "ఈదేహేంద్రియాది సముదాయమును నేను ఏమార్గముగా పొందినాఁడను? ఈవాగాదీంద్రియములచేఁ జేయంబడు వ్యాపారములనన్నిటినిఁ ప్రత్యేకప్రత్యేకముగా విభజించి తెలిసికొనునట్టినేను ఎవఁడను?" అని విచారించి, బ్రహ్మరంధ్రమును భేదించికొని దానిమూలముగా నేను దేహేంద్రియాది సముదాయమును బొందినాఁడను. ఈమార్గము విదృతియనఁబడును. దీనిద్వారముగా జీవుఁడు బ్రహ్మమునందుఁ జేరి ఆనందించుచున్నాఁడు. కావున నే యతులు జీవుఁడు బ్రహ్మరంధ్రము మూలముగా బయలువెడలుట శ్రేష్ఠమనుచున్నారు.



ఇట్లు బ్రహ్మరంధ్రము ద్వారముగా దేహమునందు జీవరూపముతోఁ ప్రవేశించిన పరమాత్మ యగునాతని కుడికన్నును మనస్సును హృదయమును క్రమముగా జాగ్రత్స్వప్నసుషుప్తులను మూఁడవస్థలయందును నాస్థానము లగుచున్నవి. ఇవి మూఁడును స్వప్నములే. ఇవ్విధముగా దేహేంద్రియాది సముదాయమునందు జీవరూపముతోఁ ప్రవేశించిన పరమాత్మ దేహేంద్రియాదులందలి తాదాత్మ్యసంబంధముచేఁ గలిగినభ్రమచేత నేను మనుష్యుఁడను, నేను కుంటివాఁడను, నేను దుఃఖవంతుఁడను అను నిట్టివానినెల్ల తనవి యని భావించి, దేహేంద్రియవ్యతిరిక్తమైన ఆత్మ నెఱుంగక యుండి నప్పుడు, భగవంతుఁడు ఆచార్యునివలన ఆత్మజ్ఞానమును బోధించెడి వేదాంతమును బోధింపఁగా, జీవరూపమగు పురుషునే!పరిపూర్ణబ్రహ్మమనియు, నేనే ఆపరబ్రహ్మమనియు, ఆశ్చర్యముతో నెఱుంగుచున్నాఁడు.

ఇట్టి ఆకాశమువంటి పరిపూర్ణబ్రహ్మసాక్షాత్కారము కలిగినపుడు, ఇట్లు సాక్షాత్కరించిన ఆపరబ్రహ్మము ఇదంద్రుఁ డగుచున్నాఁడు. ఈ ఇదంద్రుఁడే సాక్షాత్కారముకావున్నపుడు దేవతలు వర్ణలోపముచేసి "ఇంద్రుఁడు" అనిచెప్పుచున్నారు.

ఈరీతిగా కేవలపరబ్రహ్మమునందు అనాదిగా రజ్జువును సర్పమని భావించునట్లు, కల్పితమైనబుద్ధ్యాదిక మగు అంతరప్రపంచమును, దేహేంద్రియాదిక మగుబాహ్యప్రపంచమును రజ్జువునందు కల్పింపఁబడిన సర్పము వలె నిగ్రహించి, కేవలము పరబ్రహ్మమును గాంచినవారు మోక్షము

బొందుదురు. ఇట్లు తెలిసికొననివారు జననమరణములకులోనై సంసారమును బొందుచుందురు.

ఇది ప్రథమాధ్యాయమునందు తృతీయఖండసారము.

ప్రథమాధ్యాయము ముగిసెను.

---



శుక్లరూపముతో గర్భమగుచున్నాఁడు. ఇవ్విధముగా సమస్తావయవములతోఁ గూడిన రేతోరూపగర్భమును తనశరీరమునందే ధరించి స్త్రీయందుంచి జీవుని పుట్టించుచున్నాఁడు. ఇట్లు పురుషదేహమునందుండి జీవుఁడు రేతోరూపముగా వెలువడుటయే జీవునికి ప్రథమజన్మము.

ఇది ద్వితీయాధ్యాయ ప్రథమఖండసారము.

---

## ద్వితీయాధ్యాయ ద్వితీయఖండసారము.

ఇట్లు పురుషునిచే స్త్రీయందుంచఁబడిన యారేతస్సు, ఆస్త్రీశరీరములోని స్తనాదులవలెనే శరీరముతో సంబంధించియుండుటంజేసి ఆస్త్రీని

# ఐతరేయోపనిషత్తు సారసంగ్రహము.

---

## ద్వితీయాధ్యాయ ప్రథమఖండసారము.

ఇట్లు ఆజీవుఁడు సంసారమునంబడి జననమరణములకులోనై, అవిద్యాకామకర్మములు గలవాఁడై యజ్ఞయాగాదికర్మములొనర్చి ధూమాదిమార్గమూలముగా చంద్రలోకమును బొంది, అచ్చట కర్మము క్షీణమైనతర్వాత మరల వర్షము ద్వారముగా భూలోకమునుజేరి, అన్నమై పురుషాగ్నియందు హోమముచేయఁబడి, యీపిండమునందు ఈజీవుఁడు రసాదులమూలముగా

యాగర్భము బాధించుటలేదు. మఱియు ఆస్త్రీ ఆగర్భమును అనుకూలమగు ఆహారములను భక్షించి పెంపొందించుచున్నది. కావున ఆస్త్రీ, భర్తచేఁ బోషింపఁబడుచున్నది. ఆస్త్రీ గర్భధారణాది క్రమముతో ధరించుచున్నది. భర్త పుత్రజన్మకొఱకు సీమంతాదికర్మలను, పుత్రజననానంతరము జాతకర్మాదులచేతను పోషించుచున్నాఁడు. పురుషుఁడు పుత్రరక్షణము చేయుట యనునది తన్నురక్షించుకొనుటయే యగుచున్నది. పురుషుఁడు పుత్రోత్పాదనము చేయుట లోకమును సృజించుట యగుచున్నది. ఇట్లు జీవుఁడు తల్లిగర్భమునుండి వెడలుట రెండవజన్మము.

ఇది ద్వితీయాధ్యాయ ద్వితీయఖండసారము.

---

## ద్వితీయాధ్యాయ తృతీయఖండసారము.

---

ఇవ్విధముగా జీవుఁడు అపరిశుద్ధమగు పితృశరీరమునందు అశుచియగు రేతోరూపమునందుండుటయును, అనంతరము మలమూత్రములతోనిండినమాతృగర్భమునందుండుటయును, పిమ్మట బయలువెడలుటయును అగు నికష్టములను బొంది భూమిలోజన్మించియు, స్వతంత్రుఁడుగాక తండ్రియాజ్ఞకులోఁబడి యతనికిమాఱుగా సకలకర్మలను చేయుచున్నాఁడు. తండ్రిగతించినమీఁద నతఁడు తనకర్మానుగుణ్యమగు జన్మము నెత్తుచున్నాఁడు. అతండ్రియొక్క యీజన్మమే పితాపుత్రులకాత్మయొకటియైనందు

వలన నీజీవునకిదిమూఁడవజన్మము. ఇట్లు అవిద్యాకామకర్మములఁగల్గి జీవుఁడు త్రివిధజన్మములతో సంసారమును బొందుచున్నాఁడు. ఈవిధముగా జీవుఁడు జననమరణసంబంధముగలసంసారసాగరమునందుఁ బడి మిక్కిలి కష్టమొంది తుదకు శ్రుత్యుక్తప్రకారము తన్నుఁదాను తెలిసికొని కృతకృత్యుఁడగుచున్నాఁడు.

ఇది ద్వితీయాధ్యాయ తృతీయఖండసారము.

---

## ద్వితీయాధ్యాయ చతుర్థఖండసారము.

జీవుఁడు, గర్భములోనుండియే నేను పూర్వజన్మమునందుచేసిన వేదాంతశాస్త్రశ్రవణాదులవలన వాగగ్న్యాదిదేవతలజన్మలకన్నిటికిని మూలకారణమైన పరమాత్మస్వరూపమును దెలిసికొన్నాఁడ ననియును, లోహ



వికారములై అభేద్యములగు పెక్కులు శరీరములు నన్ను అధోలోకములయందు వలెనే రక్షించినవనియును, డేగ స్వసామర్థ్యముచే వలను భేదించికొనివచ్చినట్లు ఆత్మజ్ఞానసామర్థ్యముచే నేను పూర్వబంధమునుండి తప్పించికొనివచ్చితి ననియును, ఇది ఆశ్చర్యమనియు తలంచుచున్నాఁడు. ఎట్లన,

పూర్వము వామదేవమహర్షి పైని చెప్పఁబడినట్లు ఆత్మస్వరూపమును దెలిసికొనినవాఁడై, జననమరణాద్యనేకానర్థములతోఁ గూడినశరీరబంధమునకు పరమాత్మజ్ఞానామృతమును ఉపయోగించుటవలనఁ గల్గిన సామర్థ్యముచేత, అన్యశరీరమునకు హేతువైనఅజ్ఞాననాశనమువలన శరీరమునశించుటచేత పరమాత్మస్వరూపమై, అధోరూపమగుసంసారమునుండి లేచి, జ్ఞానప్రకా

శమువలన సర్వాత్మభావమును బొంది ఆత్మలోకమునందు ఆత్మజ్ఞానమువలన సమస్తకామములను బడసి ముక్తుఁడాయెను.

ఇది ద్వితీయాధ్యాయ చతుర్థఖండసారము.

ద్వితీయాధ్యాయము ముగిసెను.

---

# ఐతరేయోపనిషత్తుసారసంగ్రహము.

---

## తృతీయాధ్యాయ ప్రథమఖండసారము.

ఇట్లు వామదేవాదులచే బొందఁబడిన ప్రసిద్ధమగుసర్వాత్మభావమును పొందఁగల ముముక్షువులు, సంసార మనెడి అవిద్యాకృతశరీరాదులయందలి ఆత్మభావనతోఁ గూడినజీవత్వమును త్యజింపనెంచినవారై సభచేరి, మున్ను వామదేవమహర్షి ఏ ఆత్మనుదెలిసికొని ముక్తుఁడాయెనో దానినే మనము ఉపాసనము చేసెదము. ఆయాత్మ ఏది అనఁగా, మున్ను బ్రహ్మరంధ్రమూలముగా దేహేంద్రియాదులయందుఁ బ్రవేశించియుండు పరాపరములగు ఆత్మప్రాణములరెంటివిశేషములను విని స్మృతినొంది యీపురుషునే అపరబ్రహ్మమునుగాఁ బొందిరి. ఈరీతిగా పిండాకృతియగుపురుషుని ఆత్మప్రాణములు రెండును అన్యోన్య ప్రతికూలముగాఁ బొందినవి. ఇట్లు దేహేంద్రియరూపమగు పిండమునకు ఆత్మరూపములగు ఆత్మప్రాణములు రెంటిలోఁ ఉపాసింపఁదగిన ఆత్మయేది? అని మరల విచారింపఁదొడంగిరి. ఇట్లు విచారించి పొందఁదగినది సర్వశేషి యగుఆత్మస్వరూప మనినిశ్చయించి, అది మనస్సుచేఁ బొందఁబడు నని తెలిసికొనిరి. మఱియు ఆమనస్సొక్కటియే చతురాదీంద్రియరూపములతో ననేకవిధము లగుచున్నది. అట్టియీప్రాణాత్మయే నేత్రముచే రూపమును, శ్రోత్రముచే శబ్దమును, ఘ్రాణముచే గంధమును, జిహ్వచే రుచిని, తెలిసికొనుచున్నది. వాక్కుచే పలుకుచున్నది. ఇట్లు మనస్సనెడి ఒకయింద్రియమే అనేకవిధములయి వేర్వేరు నామములను బొందుచున్నది.

ఆమన స్సెట్లు కలిగినది ?

ప్రజల రేతస్సువలన హృదయమును, హృదయమువలన మనస్సును మనస్సువలన చంద్రుఁడును, కలిగినవి. హృదయము మనస్సు అనునివి రెండును అంతఃకరణమనఁబడుచున్నది. అంతఃకరణము మాత్ర మొక్కటియే యగును.

అంతఃకరణమునకు సాక్షి యగు ఆత్మ, నేత్రరూపమగు అంతఃకరణముచే రూపమును, శ్రోత్రరూపమగు అంతఃకరణముచే శబ్దమును, జిహ్వారూపమగు అంతఃకరణముచే రుచిని, ఘ్రాణరూపమగు అంతఃకరణముచే గంధమును తెలిసికొనుచున్నది, వాగ్రూపమగు అంతఃకరణముచే పల్కుచున్నది. స్వయ మగు మనస్సు సంకల్పవికల్పములను చేయుచున్నది. హృదయము నిశ్చయించుచున్నది. ఇట్లు అంతరింద్రియ మొకటియే చతురాద్యనేకములగు ఇంద్రియము లైనది.

ఇట్టి మనోరూపమగు అంతరింద్రియమునకు బాహ్యాంతరవృత్తు లెవ్వి?

సకలశరీరములయందును సదావ్యాపించియుండెడి చేతనభావము, ఈశ్వరభావము, చతుష్షష్టికళాదులచేఁ గల్గిన లోకసంబంధజ్ఞానము, తత్కాలమునందుఁ గల్గు ప్రతిభ, గ్రంథధారణసామర్థ్యము, ఇంద్రియముల మూలముగా సకలవిషయముల నెఱుంగుట శరీరేంద్రియములు క్షీణించియున్నపుడు శరీరమును ధరించియుండెడి ధైర్యవృత్తి, మననము, మనస్సునందలి

స్వాతంత్ర్యము, మనస్సునకు రోగాదిదుఃఖిత్వభావము, స్మరణము, రూపముయొక్క శ్వేతకృష్ణాదిభావమును సంకల్పించుట, నిశ్చయించుట, ప్రాణనము మొదలగు జీవనక్రియానిమిత్త మగువృత్తి లేనిపదార్థములను అభిలషించుట, స్త్రీసంబంధమగు వ్యసనాదులయందు అభిలాష, ఈ అంతఃకరణవృత్తులు శుద్ధమై వికారరహితమై యుండు పరమాత్మకు ఉపాధులైయున్నవి.

అంతఃకరణవృత్తుల ననుసరించి పరబ్రహ్మమునకు ఔపచారికముగా సర్వసాక్షి యగుప్రజ్ఞానమునకు సంజ్ఞానము, అజ్ఞానము, విజ్ఞానము, ప్రజ్ఞానము, మేధ, దృష్టి, ధృతి, మతి, మనీషా, జూతి, స్మృతి, సంకల్పము, క్రతువు అసువు, కామము, వశము ఇత్యాదినామములు గలుగుచున్నవి.

ఈ ప్రజ్ఞానాత్మయొక్కటియే జలములోఁ బ్రతిబింబించిన సూర్యునింబోలె అంతఃకరణమందు ప్రవేశించియుండు ప్రాణరూపమైన ఆత్మయని తెలియఁదగినది. ఇదియే దేహేంద్రియాదులయందు బ్రవేశించి ఇంద్రుఁడను పేరుగల్గియున్నది. ఈప్రజ్ఞానాత్మయే అగ్న్యాది దేవతలను పంచభూతములును, సకలస్థావరజంగమములును సకలలోకములునై యున్నది. ఇదే సకలజగత్తునకునుస్థితియైనది. ఇదే శాశ్వతమగు శేషించిన బ్రహ్మము. ప్రాచీనులగు బ్రహ్మజ్ఞానులు దీనిచేతనే ముక్తినిఁ బొందిరి. వామదేవఋషియును ఈప్రజ్ఞానాత్మచేతనే గూటిలో నుండి పక్షియెగిరినట్లు దేహాత్మజ్ఞానమునుండి విడిచిపోయి ప్రజ్ఞానాత్మతో నైక్యమై పరమానందరూప మగునాత్మలోకమునందు సకలకామములను బొందు ముక్తుఁడయ్యెను.

ఇది తృతీయాధ్యాయప్రథమఖండసారము.

ఐతరేయోపనిషత్తుసారసంగ్రహమునందు సర్వంబును సమాప్తము.

---

# ఉదాహృతగ్రంథసంకేతము.

---

ఆ= ఆనందగిరిటీక
ఈశ= ఈశావాస్యోపనిషత్తు
కౌషీ= కౌషీతక్యుపనిషత్తు
గీత= భగవద్గీత
జా= జాబాలోపనిషత్తు
తై= తైత్తిరీయోపనిషత్తు
బృ= బృహదారణ్యకోపనిషత్తు
శ్వేతా= శ్వేతాశ్వతరోపనిషత్తు

---

# మంత్రాద్యక్షరాది సూచిక.

| క్రమసంఖ్య | మంత్రములు. | అధ్యాయ సంఖ్య. | ఖండ సంఖ్య. | మంత్ర సంఖ్య. | పుట సంఖ్య. |
|---|---|---|---|---|---|
| 29 | స ఏతమేవసీమానం | 1 | 3 | 12 | 144 |
| 30 | స ఏతేనప్రజ్ఞేనాత్మనాఽ (స ఏతేనైవ) | 3 | 1 | 5 | 156 |
| 31 | స ఏవం విద్వాన | 2 | 4 | 3 | 138 |
| 32 | సజాతో భూతాన్యభి | 1 | 3 | 13 | 116 |
| 33 | సంజ్ఞానమాజ్ఞానం | 3 | 1 | 3 | 146 |
| 34 | సాభావయిత్రీ | 2 | 2 | 2 | 126 |
| 35 | సోఽపోఽభ్యతపత్తాభ్యోఽ | 1 | 3 | 2 | 96 |
| 36 | సోఽస్యాయమాత్మా | 2 | 3 | 1 | 132 |

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1920.

| | | | |
|---|---|---|---|
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | | 0 | 4 |
| వివేకచూడామణి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| హరిమీడేస్తోత్రము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| ఆత్మబోధము ,, ,, | ... | 0 | 4 |
| సౌందర్యలహరి, ఆంధ్రటీకాసహితము, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| రామగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు | | 1 | 4 |
| భగవద్గీతలు, చిన్నసైజు, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 10 |
| భగవద్గీతలు, ,, శ్రీఆనిబిసెంటుగారిఇంగ్లీషుతర్జుమాతో | | 0 | 8 |
| శివగీతా, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 10 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు, మంచికాకితములు | ... | 0 | 8 |
| శ్రీమద్భగవద్గీతారహస్యము | ... | 3 | 4 |

| | | | |
|---|---|---|---|
| అద్వైతోపదేశపంచరత్నములు, (సాధనపంచకము) | | 0 | 2 |
| వేదాంతస్తోత్రపంచకము, శ్రీశంకరాచార్యకృతము, ఆంధ్రతాత్పర్యసహితము:— ఇందు ఏకశ్లోకి, యతిపంచకము, మనీషాపంచకము, ప్రాతఃస్మరణము మొదలైనవి గలవు. | | 0 | 4 |
| హఠయోగప్రదీపిక— ఆంధ్రతాత్పర్య విశేషార్థములే గాక, 123 యోగాసనపటములు, రాజయోగదీపిక, యోగశాస్త్రసారము, బ్రహ్మవిద్యాశీర్వాదపద్ధతి యున్నవి | ... | 3 | 8 |
| రాజయోగరత్నాకరము:— శ్లోక తాత్పర్య విశేషార్థములతోను [illegible]పటములతోను ముద్రితము | ... | 2 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

